# Chandamama Press

VADAPALANI
MADRAS 26



OFFERS YOU...

FINEST PRINTING.–

*Equipped with*

PHOTO GRAVURE
KLIMSCH CAMERA
VARIO KLISCHOGRAPH–
–BLOCK MAKING

*and a host of Others....*

# కాల్గేట్‌తో రోజంతా చెడ్డ శ్వాసను నిరోధించండి
# దంతక్షయాన్ని నివారించండి!

ఎందుచేతనంటే కాల్గేట్ డెంటల్ క్రీమ్‌తో ఒక్కసారి తోమినంతనే 85% వరకు నోటి దుర్వాసన మరియు దంతక్షయ కారకులైన సూక్ష్మ క్రిములు తొలగిపోవును.

కాల్గేట్ 10 మందిలో 7 గురి చెడ్డ శ్వాసను వెంటనే అరికట్టినదని మరియు కాల్గేట్ పద్ధతితో భోజనానంతరం పళ్లు తోము కొనుట వల్ల దంత శాస్త్రి చరిత్రలో మునుపు ఎప్పుడూ ఎరుగనంత ఎక్కువ మందికి దంతక్షయమును బాగా అరికట్టిందని శాస్త్రి పరీక్షలు నిరూపించాయి!
కాల్గేట్‌లో మాత్రమే యీ ఋజువు ఉన్నది.

ఎంతో చక్కని పిప్పరమెంటు రుచికూడా—
కాల్గేట్‌తో క్రమంగా పళ్లు తోముకోవటం
పిల్లలకు చాలా ఇష్టం.




మీకు పౌడరు కావాలంటే,
ఈ ప్రయోజనాలన్నింటినీ
కాల్గేట్ టూత్ పౌడరు
వల్ల పొందండి...
ఒకడబ్బా నెలల
తరబడి వస్తుంది!




శుభ్రతకు, తాజా శ్వాసకు, ధవళ దంతాల కోసం...
ప్రపంచంలోని ఏ ఒక్క ఇతరటూత్‌పేస్టు కన్నా కాల్గేట్‌నే ఎక్కువ మంది వాడుతున్నారు.

DC.G.38 TL

# చందమామ

ఈ సంచికలో కథలు - వింతలు - విశేషాలు



ఇవి గాక ఫోటో శీర్షికల పోటీ, మరి ఎన్నో ఆకర్షణలు.


వేసవి తాపమే తెలియకుండుటకు ఉత్తమమైనవి.

# అశోకా శాండల్‌వుడ్ ఫేస్ టాల్కు & ఆల్బర్ట్స్ పౌడర్సు

ప్రతి దినము ఉపయోగించిన, వేసవి తాపమునణచి - శరీరమును చల్లాగాను హాయిగాను పరిమళభరితముగను ఉంచును




విజయ కెమికల్సు
మద్రాసు-7

# Ensure Your Success

With

**GLOBE**

ACCURACY







Other Famous Brands
of Geometry Boxes by **KASHYAPS**

**DELTA, KOH-I-NOOR, HORSE**

KARAN

Mfg. **G. S. KASHYAP & SONS** Pataudi House, Darya Ganj, Delhi-6

---




*పొదుపునకు...*

ప్రకాశవంతంగా, పరిశు-
భ్రంగా చిరకాలం, పొదు
పుగా పని చేసే లాంపు.

ఎల్లపుడును వాడండి

## బెంగాల్

ఇండియాలో శ్రేష్టమైనది
బెంగాల్స్ కొయిల్డ్ కాయిల్ లాంపులే
ఎల్లపుడు వాడండి. నమ్మకమైనది.

మీకు చల్లని, ప్రకాశవంత
మైన వెలుగునిచ్చే లాంపు

బెంగాల్ **హంస**

పాలతెలుపు లాంపు.




ఆంధ్రప్రదేశ్కు సోల్ సెల్లింగ్ ఏజెంట్లు:
**జి.ప. పరశురామ్ & కంపెని.**
11-4-658/2, లకడికాపూల్. హైదరాబాద్. 4. A.P.



బెంగాల్ ఎలెక్ట్రికల్ కంపెనీ, బెంగళూరు - 3 & మదరాసు - 17




# అమర చిత్ర కథ

## ప్రపంచ ప్రఖ్యాతిగాంచిన కట్టు కథలు

### ఇంగ్లీషులో లక్షలాది కాపీలు అమ్ముడైపోయినవి ఇప్పుడు తెలుగులో లభిస్తున్నాయి
















ఇప్పుడు లభిస్తున్న కథలు...

1 చిన్నా-చిక్కుడు తీగ
2 సిండెరెల్లా
8 ఎఱ్ఱ గులాబీ పాపాయి
4 అల్లాదీను-అద్భుత దీపం
5 విచిత్ర జలధార
6 ముగ్గురు పందుల కథ
7 నిద్రాసుందరి
8 టాంయ్ రాజా
9 పినోకియో
10 హిమబాల-ఏడుగురు మరుగుజ్జులు

ఈ భాషల్లో ప్రచురింపబడినవి
హిందీ, గుజరాతీ, మరాఠీ, బెంగాలీ,
తమిళం, తెలుగు, మలయాళం, కన్నడ

వెల ఒక్కొక్కటి 75 పైసలు | పోస్టేజి అదనము

పుస్తక విక్రేతలవద్ద, పత్రికల ఏజెంట్లవద్ద లభిస్తున్నాయి.
లేక యీ ఎడ్రసుకు వ్రాయండి




**ఇండియా బుక్ హౌస్,**
3-4-423, నారాయణగూడ, హైదరాబాదు-29.

3 brothers 176


నేడే
చూడండి!





యన్. రంగారావు సమర్పించు శ్రీదేవి కంబైన్స్
భలే అబ్బాయిలు
దర్శకత్వం
పేకేటి శివరామ్ B.A
నిర్మాత
తోట సుబ్బారావు
డిస్ట్రిబ్యూటర్స్: ఆంధ్ర:జ్యోతి సీడెడ్:జయలక్ష్మి నైజాం:దివ్యదత్తా

గృహము మనోహరముగా చిత్రమయముగా ఉండాలంటే!
గృహము అతి ఆధునికముగా నవ నవీనముగా ఉండాలంటే!

ఎప్పుడూ వాడవలసింది

# AMARJOTHI FABRICS

**BEDSPREADS - FURNISHINGS - FANCY TOWELS**



A GREAT NAME  IN HANDLOOMS



తయారీ :
అమర్‌జ్యోతి ఫాబ్రిక్స్,
పోస్టుబాక్సు నం. 22, కరూర్ (ద.భా.)
బ్రాంచీలు : బొంబాయి—ఢిల్లీ

మద్రాసు ఏజెంట్లు :
అమర్‌జ్యోతి ట్రేడర్స్,
99, గొడౌన్ స్ట్రీట్, మదరాసు : 1
ఫోన్ : 34854



# వాయిదాలపై ట్రాన్సిస్టర్లు



రూ. 320/- ఖరీదుచేసే, లోకప్రసిద్ధి చెందిన 'ఎస్కార్ట్' 3 బ్యాండ్ అఖిల ప్రపంచ పోర్టబుల్ ట్రాన్సిస్టరును నెలకు రూ.10/-లు చొప్పున వాయిదాల పద్ధతిని తెప్పించుకోండి. భారతదేశంలో ప్రతి పల్లెకూ, పట్టణానికి కూడ పంపగలము.

వివరములకు :

**JAPAN AGENCIES** (CM-M. 10)
**POST BOX 1194 :: DELHI-6**




అతడి జీవనోపాధికి మంచి చదువు చెప్పించి అతడి భావి శ్రేయస్సుకు బాట వేయవలసిన సమయం త్వరలో మీకు వస్తుంది. మంచి చదువంటే ఈ రోజుల్లో మాటలా? వ్యయంతో కూడిన పనే: కాబట్టి అగర్భ శ్రీమంతులైతే తప్ప, ఎవరు గాని

## రేపు సుఖపడేందుకు నేడే ఆదా చేయాలి.

ఇందుకు మేలైనవి మా డిపాజిట్లు :

| | |
|---|---|
| ఫిక్సెడ్ డిపాజిట్లు : | వడ్డీ సాలుకు 6-5/8% వరకు |
| లేక సేవింగ్స్ డిపాజిట్లు : | వడ్డీ సాలుసరి 3-1/2% |
| లేక రికరింగ్ డిపాజిట్లు : | ఉద్యోగస్తులకు ఉత్తమమైనవి |

# ది ఆంధ్రా బ్యాంక్ లిమిటెడ్

(స్నేహపూర్వకమైన సేవ నిచ్చే సంస్థ)

(సెంట్రల్ ఆఫీసు, హైదరాబాద్)

మొత్తము బ్రాంచీలు: 121

కె. గోపాల్‌రావు
ఛైర్మన్

# ఒకడజను యింత చక్కని ఫోటోలు తీయండి



రు. 46.50

## ...కెమెరా కొన్న రోజునే Agfa క్లిక్ III

మొదలు పెట్టుటకు శ్రేష్ఠము
వదల పెట్టుట కష్టము!

* గురిపెట్టి క్లిక్ చెయ్యండి. చిక్కు-పెట్టే సాధనా లేమీ లేవు. పొరబాట్లు చేసే అవకాశంలేదు.
* 120 సైజు రోలు ఫిల్ముమీద 12 పెద్ద (6×6సెం. మీ) ఫోటోలు తీయవచ్చు.
* ఎవరెడీ కేసు పోర్ట్రెయిట్ లెన్సు. యింకా ఫ్లాష్ గన్ అదనంగా కొనుక్కో-వచ్చు.



కళ కళ లాడే ప్రింట్లకు,
ఎన్‌లార్జ్‌మెంట్లకు అగ్ఫా ఫొటో
పేపర్లు మాత్రమే కావాలని అడగండి

అగ్ఫా పర్యవేక్షణ క్రింద తయారుచేయువారు : ది న్యూ ఇండియా ఇండస్ట్రీస్ లిమిటెడ్, బరోడా.



దేశానికంతా డిస్ట్రిబ్యూటర్లు :
ఆగ్ఫా-గెవర్టు, ఇండియా లిమిటెడ్
బొంబాయి • న్యూఢిల్లీ • కలకత్తా • మద్రాసు

CMAG-118 TEL





## నియమ విధులను పాటిస్తూ ఆడడం నేర్పుతున్నారా?
## ఫోర్‌హాన్స్‌తో దంతసంరక్షణను కూడా అతనికి నేర్పండి

మీ బిడ్డ జీవితంలో ప్రతిదీ సక్రమంగా, నియమబద్ధంగా చేసి, తనుచేసే ప్రతి విషయంలో తన స్నేహితులను మించి పోవాలనుకునే సమయమొస్తుంది. అదే సరియైన దంత సంరక్షణ—ఫోర్‌హాన్స్‌తో—నేర్పటకు మంచి తరుణం □ ఫోర్‌హాన్స్ ఇగుళ్ళ జబ్బులను దంత క్షీణతను నివారించు టూత్ పేస్టు, ఒక దంత వైద్యుని చేత నిర్మింపబడిన ఈ టూత్ పేస్టులో బిగువైన పళ్ళకు ఇగుళ్ళకు కావలసిన ప్రత్యేకమైన మందులున్నాయి. అది మీకు మంచిది—మీ బిడ్డకు కూడా మంచిది. అందుకని నియమం తప్పకుండా తన పళ్ళను ఫోర్‌హాన్స్‌తో—ఉదయం, రాత్రి తోము కోవడం నేర్పండి. జీవితాంతం అవసరమైన దంత సంరక్షణ ఇప్పుడే నేర్పండి.

**జాగు చేయ్యక ఫోర్‌హాన్స్‌తో దంతసంరక్షణ ఇప్పుడే నేర్పండి**

ఉచితం: "పళ్లు, ఇగుళ్ళను గురించి తీసుకోవలసిన శ్రద్ధ"* అనే రంగుల చిత్రాలలోనున్న ఈ చిన్న పుస్తకం అనేక విషయాలను తెలుపుతుంది. వది భాషల్లో† దొరుకుతుంది. (తపాలా ఖర్చుకు) 15 పై. బిళ్ళలు పంపండి.

అడ్రసు: మానర్స్ డెంటల్ అడ్వైజరీ బ్యూరో, పోస్టు బ్యాగు నం. 10031, బొంబాయి-1.

పేరు ______________________

అడ్రసు ______________________

† మీకు కావలసిన భాష క్రింద గీత పెట్టండి: తెలుగు, ఇంగ్లీషు, హిందీ, మరాఠీ, గుజరాతీ, ఉర్దూ, బెంగాలీ, అరవం, మలయాళం, కన్నడ.

* ఈ పుస్తకం అరడు చదివే పుస్తకాలలోకెల్లా ముఖ్యమైనది కావచ్చు




**ఫోర్‌హాన్స్**
**టూత్ పేస్టు—ఒక దంతవైద్యుడు నిర్మించినది**

32F-182 TEL



# చందమామ

సంచాలకుడు: 'చక్రపాణి'

ఈ సంచికలో ప్రచురిస్తున్న "ఖజానా దొంగ" అన్న కథ లోగడ మరొక రూపంలో చందమామలో ప్రచురించి ఉన్నాము. అయితే ఇలాటి కథలు ప్రపంచసాహిత్యం నిండా ఉన్నాయి. ఇప్పుడు ప్రచురించే ఈ కథ ఆ కథలన్నిటికీ మూల కథ. ఇది ఈజిప్టు నుంచి వచ్చిన కథ. అతి ప్రాచీనమైన నాగరికతలలో ఈజిప్టు నాగరికత ఒకటి.

ఈ నెల ప్రచురించిన బేతాళకథ ["విషప్రయోగం"] రచించినది శ్రీ అజ్జరపు హనుమంతరావు.

సంపుటి 44 ఏప్రిల్ '69 సంచిక 4



# ఖజానాదొంగ

మూడువేల ఏళ్ళ క్రితం మూడవ రామిసిస్ అనేవాడు ఈజిప్టుకు చక్రవర్తిగా పట్టాభిషిక్తుడయాడు. అతని హయాంలో ఈజిప్టు సుభిక్షంగా ఉంటూ వచ్చింది. అందుచేత రామిసిస్ పూర్వపు చక్రవర్తు లందరికన్నా హెచ్చు ధనం కూడబెట్టాడు. వెండి బంగారాలూ, రత్నాలూ కూడబెట్టు తున్న కొద్దీ అతనిలో ధనలోభం పెరుగుతూ వచ్చింది. ఆ కారణంగా అతను ఒక ప్రఖ్యాత శిల్పిని పిలిపించి, అతనిచేత ఒక దుర్భేద్యమైన ధనాగారాన్ని కొండరాళ్ళతో నిర్మింప జేసి, అందులో ఒక రహస్య ద్వారం ఏర్పాటు చేయించాడు. ఆ ద్వార రహస్యం చక్రవర్తికి మాత్రమే తెలుసును. ఆయన ఆ ద్వారం కుండా తరుచు ధనా గారంలోకి వెళ్ళి, అక్కడి నుంచి తిరిగి వచ్చేటప్పుడు రహస్యద్వారానికి సీలు వేస్తూ ఉండేవాడు.

ఆ ధనాగారాన్ని నిర్మించిన శిల్ప ప్రవీణుడు, చక్రవర్తికి తెలియకుండా ధనా గారపు రాతిగోడలలో ఒక రహస్యమైన రాతితలుపు అమర్చి, దాన్ని చేరుకోవ టానికి ఒక మార్గం కూడా వదిలి, ధనా గారం మీద పిరమిడ్ నిర్మించాడు. ఆ శిల్పి అటు తరవాత ఎక్కువ కాలం జీవించ లేదుగాని, తాను చనిపోయేలోగా చక్రవర్తి నిధిని కొద్దిగా తస్కరించాడు. తరవాత ఆయన మరణించబోతూ తన కొడుకుల నిద్దరినీ పిలిచి, వారికి రాతితలుపు రహస్యం చెప్పి మరీ కన్ను మూశాడు. తండ్రి అనంతరం అన్నదమ్ములు అప్పుడప్పుడూ చక్రవర్తి ధనాగారం ప్రవేశించి, అక్కడి నుంచి ధనం దొంగిలించి తెచ్చుకుంటూ ఉండేవారు.

ఇంచుమించు రోజూ తన సంపదను చూసుకునేవాడు కావటంచేత చక్రవర్తి తన





ధనాగారంలోకి దొంగలు వస్తున్నట్టు పసి గట్టాడు. రహస్య ద్వారానికి తాను వేసిన సీళ్ళు వేసినట్టే ఉంటున్నాయి. ధనాగారపు రాతిగోడల కుండా చీమ దూరే సందు కూడా లేదు. అలాటి పరిస్థితిలో దొంగలు ఏ దారిన వస్తున్నారో అంతు పట్టలేదు. ఏ మార్గానో ఒక మార్గాన దొంగలు వచ్చే మాట రూఢే గనక, దొంగలను పట్టుకోవటం ముఖ్యం. అందుకని చక్రవర్తి తన నిధి నిక్షేపం చుట్టూరా కత్తెరబోను ఒకటి అమర్చాడు.

ఈసారి అన్నదమ్ములు రాతి తలుపు తోసుకుని ధనాగారం ప్రవేశిస్తుండగా అన్న కాలు కత్తెరబోనులో చిక్కుకున్నది. చీకటిలో అతను దాన్ని చూడలేదు. ఎంత ప్రయత్నించినా కాలు విడిపించుకోవటం అతనికి సాధ్యం కాలేదు. అందుచేత అతను తమ్ముడితో, "తమ్ముడూ, నేను బోనులో చిక్కుకున్నాను. నాకు ఎలాగూ చావు తప్పదు. రేపు చక్రవర్తి నన్ను చూసి గుర్తిస్తే నీకు కూడా చావు తప్పదు. ఇద్దరమూ చచ్చి అమ్మకు పుత్రశోకం ఎందుకు కలిగించాలి? నా తల నరికి తీసుకుపో. నన్నెవరూ గుర్తించరు. నాకు కూడా సుఖ మరణం కలుగుతుంది," అని చెప్పాడు.

అన్న చెప్పిన మాటలలో వివేకం ఉన్న దని గ్రహించిన తమ్ముడు అన్న తల నరికి, రాతి తలుపు యథా ప్రకారంగా మూసి, ఇంటికి వెళ్ళి, జరిగినదంతా తల్లికి చెప్పి, అన్న తలను విధ్యుక్తంగా పాతిపెట్టాడు.

మర్నాడు ఉదయం చక్రవర్తి ధనాగారం ప్రవేశించగానే అందులో ఒక దొంగ మొండెం కనబడింది. దానికి బట్టలు లేవు, తల కూడా లేదు. దొంగ ఎవడో తెలియ లేదు. ఎలా వచ్చాడో మొదలే తెలియలేదు. కాని ఇంకొక దొంగ ఉన్నాడని స్పష్ట మయింది. వాడే బోనులో చిక్కినవాడి తల నరికి తీసుకుపోయాడు. వాణ్ణి ఎలాగైనా





తూంటాడు. అందుచేత వాడి కళేబరాన్ని నువు తీసుకురా. లేదా, నేనే చక్రవర్తి దగ్గిర మొర పెట్టుకుని, దాన్ని ఇవ్వ మంటాను," అన్నది.

"తలే గదమ్మా ముఖ్యం? దాన్ని శాస్త్రోక్తంగా పాతిపెట్టాను," అన్నాడు చిన్న కొడుకు. కాని ఆమె వినిపించుకోలేదు. అన్న శరీరాన్ని ఏదో విధంగా తీసుకు రావటం తప్పనిసరి అయింది.

అందుచేత, చిన్నవాడు ముసలి వర్తకుడిలా వేషం వేసుకుని, ఒక గాడిద మీద సారాయి నింపిన రెండు తోలుతిత్తులు పెట్టుకుని, గాడిదను తోలుకుంటూ కోట కేసి బయలుదేరాడు. అన్న శవం వేళ్ళాడే స్థలం సమీపిస్తూండగా వాడు ఒక తోలు తిత్తికి బెజ్జం పెట్టి, పెద్ద పెట్టున ఏడవ సాగాడు. వాడి శోకాలువిని పహరావాళ్ళు పరిగెత్తుకుంటూ వచ్చి, "ఏం జరిగింది, తాతా? ఎందు కేడుస్తున్నావు?" అని అడిగారు.

"నా సారాయంతా కారిపోతోంది. ఖరీదైన సారాయి!" అన్నాడు చిన్నవాడు. అది అంగడికి చేరే లోపల కారిపోతుందనీ, అంతకన్న పహరావాళ్ళు తాగెయ్యటమే మేలనీ వాడు అన్నమీదట పహరావాళ్లు పరమానందంతో తిత్తి ఖాళీ చేశారు.

పట్టాలని చక్రవర్తికి పట్టుదల కలిగింది. ఆయన చచ్చిపోయిన దొంగ మొండాన్ని కోటగోడకు వెళ్ళాడదీయించి, దానికి పహరా వాళ్ళను ఏర్పాటు చేసి, "ఈ మొండాన్ని తీసుకుపోవటానికి ఎవరైనా యత్నించినా, చూసి కంటతడి పెట్టినా, పట్టి నా దగ్గిరికి తీసుకురండి," అని ఉత్తరువిచ్చాడు.

తన పెద్ద కొడుకు మొండెం కోటగోడకు వేళ్ళాడుతున్న వార్త విని దొంగల తల్లి తన రెండో కొడుకుతో, "నా కొడుకు శవం ఉత్తరక్రియలు లేకుండా అలా ఉంటే వాడి ఆత్మ పితృలోకాన్ని ఎలా చేరుతుంది? వాడు దయ్యమై భూమి మీదనే తిరుగు

ఇదంతా తనను పట్టటానికి చక్రవర్తి వేసిన ఎత్తేనని చిన్నవాడికి తెలిసిపోయింది. అయినా, తాను చక్రవర్తిని యుక్తిలో మించగలనని రుజువు చెయ్యాలన్న ఉద్దేశంతో అతను రాజకుమార్తెను చూడటానికి చీకటి పడే వేళ బయలుదేరాడు. పోతూ పోతూ అతను వధ్యస్థానంలో ఆ నాడే ఉరి తీసిన ఒక నేరస్థుడి చెయ్యి కోసి, తన ఉత్తరీయం లోపల దాచుకుని మరీ వెళ్ళాడు.

అతను రాజకుమార్తె వద్దకు వెళ్లి, ఆమెను పెళ్ళాడటానికి వచ్చినట్టు చెప్పేసరికి, "నీ జీవితంలో నీవు చేసిన అతి గొప్ప సాహస దారుణ కృత్యమేమిటి, యుక్తి బుద్ధి కుశలతలతో చేసిన పని ఏమిటి?" అని ఆమె అడిగింది.

అతను తన అన్న తలను నరికి తీసుకుపోవటం తాను చేసిన దారుణ కృత్యంగానూ, అతని మొండాన్ని విడిపించుకుపోవటం యుక్తి కృత్యంగానూ చెప్పాడు. తన తండ్రి వెతుకుతున్న మనిషి అతనేనని రాజకుమార్తె గ్రహించి, "బాగుంది. నిన్ను పెళ్ళాడతాను. నీ చెయ్యి ఇయ్యి," అన్నది. చిన్నవాడు తన ఉత్తరీయం చాటునుంచి శవం చేతిని అందించాడు. ఆమె దాన్ని గట్టిగా పట్టుకుని, "దొంగ దొరికాడు! రండి! రండి! పట్టుకోండి!" అని అరిచింది.

పహరావాళ్ళు పరిగెత్తుకుంటూ వచ్చారు. చిన్నవాడు శవం చేతిని వదిలేసి, దొడ్డిదారిన బయటికి పారిపోయి, చీకట్లో మాయమయాడు.

దొంగ దొరికి కూడా తప్పించుకు పోయాడని తెలిసి చక్రవర్తి అతన్ని మెచ్చుకుని, అతను తానెవరో తెలుపుకుంటే శిక్షించననీ, తన కూతురినిచ్చి పెళ్లిచేసి తన కొలువులో ఉంచుకుంటాననీ బహిరంగంగా ప్రకటించాడు. ఆ విధంగా దొంగ కాస్తా చక్రవర్తికి అల్లుడూ, ఆయన సర్దార్లలో ఒక ముఖ్యుడూ అయాడు.





"ఈ రెండో తిత్తి వుండిమాత్రం ప్రయోజన మేమిటి. ఇది గాడిద వీపుమీద నిలవదు. దీన్ని కూడా మీరే తాగెయ్యండి," అన్నాడు చిన్నవాడు.

అది కూడా తాగి పహరావాళ్ళందరూ ఒళ్ళు తెలియకుండా పడిపోయారు. అప్పటికే చీకటి పడుతున్నది. చిన్నవాడు తాపీగా తన అన్న శరీరాన్ని గాడిద మీద వేసి, దాని మీద తిత్తులు కప్పి, తిన్నగా ఇంటికి వెళ్ళిపోయి, అన్న శరీరాన్ని కూడా విధ్యుక్తంగా పాతి పెట్టాడు.

శవం పోయిందన్న సమాచారం తెలిసి మర్నాడు చక్రవర్తి మండిపడ్డాడు. తమ విధిని సరిగా నిర్వర్తించనందుకు ఆయన పహరావాళ్ళందరినీ కొరడాలతో కొట్టించి, శిక్షించాడు. దొంగను పట్టుకు తీరాలన్న అభిప్రాయం ఆయనకు మరింత దృఢంగా కలిగింది. అందు కాయన ఒక పథకం ఆలోచించాడు. ఆయన తన కుమార్తెలలో ఒకామెకు విదేశీ దుస్తులు ధరింప జేసి, నగర ద్వారం వెలపల బస చేసేటట్టు ఏర్పాటు చేశాడు.

దారుణ కృత్యాలూ, బుద్ధికౌశలంతో కూడిన పనులూ చేసిన వారిలో సాటిలేని వాణ్ణి తాను పెళ్ళాడతానని చక్రవర్తి కూతురు ప్రకటన చేసింది.





# ఏదీ దక్కదు!

ఒక రాజుగారి తోటలో ఒక అపూర్వమైన గులాబీచెట్టు ఉండేది. అది ఏటా ఒక్క మొగ్గ తొడిగేది. కాని మొగ్గ విచ్చేలోపల ఏదో పురుగు వచ్చి దాన్ని తినేసేది.

ఎంతమంది తోటమాలీలను మార్చినా లాభం లేకపోయింది. చివర కొక తోటమాలి వచ్చాడు, ఈసారి గులాబీని పురుగు నుంచి కాపాడకపోతే తన తల తీసెయ్యమన్నాడు.

వాడు తోటమాలిగా కుదిరిన ఏడు గులాబీ మొగ్గ తొడిగింది. అది మర్నాటికి విచ్చు కుంటుందనగా ఆ రాత్రి తోటమాలి దాని దగ్గిరే మేలుకుని కూర్చున్నాడు.. తూర్పు తెల్లవారుతూండగా ఒక పురుగు వచ్చి గులాబీ మొగ్గ మీద వాలింది. కాని తోటమాలి దాన్ని చంపేలోపల ఒక పికిలిపిట్ట లాటిది వచ్చి ఆ పురుగును తన్నుకు పోయింది.

కొంచెం పొద్దెక్కే సరికల్లా గులాబీపువ్వు విచ్చుకున్నది. నిజంగా అది చాలా అందమైన పువ్వు. తోటమాలి దాన్ని తీసుకు పోయి పరమానందంతో రాజుగారికి ఇచ్చాడు.

"దీన్ని ఎలా కపాడావు?" అని రాజు అడిగాడు.

"నేను చంపేలోపునే పురుగును ఏదో పిట్ట తన్నుకు పోయింది, మహారాజా," అన్నాడు తోటమాలి.

రాజు నిట్టూర్చి, "పురుగును పిట్ట తిన్నది. రేపా పిట్టను ఇంకేదో తింటుంది. ఏదీ దక్కదు!" అన్నాడు.

మరసటి సంవత్సరం గులాబీ మళ్ళీ మొగ్గ తొడిగింది. అది విచ్చుకునే సమయానికి తోటమాలి మళ్ళీ కాపలా ఉన్నాడు. ఈసారి కూడా పురుగు వచ్చింది. అది మొగ్గపైన వాలీ వాలక ముందే పిట్ట వచ్చి పట్టుకుని, నేలపై వాలింది. మరుక్షణమే ఒక పొదలో నుంచి పాము ఒకటి వచ్చి పిట్టను పట్టేసింది.

టి. లక్ష్మికుమార్

తోటమాలి రాజుగారికి గులాబీపువ్వు ఇస్తూ ఈ సంగతి చెబితే రాజు నిట్టూర్చి, "నేను చెప్పలేదా? ఆ పామూ దక్కదు!" అన్నాడు. మరుసటి ఏడు గులాబీమొగ్గ కోసం పురుగు వచ్చింది. ఆ పురుగును ఒక పిట్ట పట్టుకున్నది. ఆ పిట్టను పాము పట్టుకున్నది. తోటమాలి ఆ పామును తన దుడ్డు కర్రతో చంపాడు.

అంతా తోటమాలి నుంచి విని, "పాము దక్కదని చెప్పాను కానా? ఏదీ దక్కదు!" అన్నాడు రాజు. ఈసారి రాజు అన్న మాట తోటమాలిని కలవర పెట్టింది.

ఒక రోజు తోటమాలి ఒక చెట్టు మీద ఉండి, కాయలకు గుడ్డలు కట్టుతూండగా, తోటలోకి రాణీగారు చెలికత్తెలతో వచ్చింది. అందరూ సరస్సులో దిగి స్నానాలుచేశారు. రాణీగారు తనను ఎక్కడ చూసి పోతుందోనని తోటమాలి చెట్టు మీద అలాగే కొయ్యబారి ఉండిపోయాడు.

కాని, స్నానం ముగించి బయటికి వచ్చేటప్పుడు రాణి తల ఎత్తి తోటమాలిని చూడనే చూసింది. ఆమె రాజుతో ఫిర్యాదు చేసింది. రాజు తోటమాలి తల నరికెయ్యమని ఉత్తరువిచ్చాడు.

భటులు తోటమాలిని వధ్యస్థానానికి తీసుకు పోయేముందు రాజువద్దకు తెచ్చారు. తోటమాలి రాజుకు నమస్కారం చేసి, "మహారాజా, తమ రన్నది అక్షరాలా రుజువయింది. గులాబీ మొగ్గను కొట్టిన పురుగు దక్కలేదు, అది పిట్టచేత చచ్చింది. పిట్టా దక్కలేదు, అది పాముచేత చచ్చింది. పామూ దక్కలేదు, అది నాచేత చచ్చింది. నేనూ దక్కను, తమరి చేత తల తీసేయించుకుంటున్నాను. ఏదీ దక్కదు! నిజం!" అన్నాడు.

ఆ మాటలు వినేసరికి రాజుకు కంపరం పుట్టుకొచ్చింది. అయన తోటమాలి శిక్షను రద్దు చేసి, వాణ్ణి పనిలో ఉండ నిచ్చాడు.





# శిథిలాలయం

## 16

[పెద్దపులి మీద పడటంతో, చెంచులు సెగళ్ళ దగ్గిర నుంచి పారిపోయారు. ఎంత వెతికినా శిఖిముఖికి, నాగుమల్లి కనిపించ లేదు. శిథిలాలయ పూజారి ఆమెను తీసుకుని పారిపోయినట్టు చెంచు దయ్యాలపోతు అతడికి చెప్పాడు. మోకు సాయంతో కొండ మీది నుంచి లోయలోకి దిగి పోతున్న పూజారిని, శిఖిముఖి వెంబడించాడు. తరవాత—]

శిఖిముఖి లోయలోకి దిగేసరికి అతడికి పూజారిగాని, నాగుమల్లిని వీపుకు వేలాడ కట్టుకున్న గండభేరుండంగాని కనిపించ లేదు. వాళ్ళు అతడికన్న కొంచెం ముందుగా లోయలోకి దిగగలిగారు. శిఖిముఖి చుట్టూ కలయ చూసేంతలో అతడికి దూరంగా గుర్రం సకిలించిన ధ్వని వినబడింది. వెంటనే అతడు ఆ దిక్కు కేసి వేగంగా పరిగెత్తాడు. చీకట్లో క్రమంగా దూరమై పోతున్న గిట్టల ధ్వని తప్ప అతడికి గుర్రం కనిపించలేదు.

శిఖిముఖి నిరుత్సాహ పడిపోతూ, యిప్పుడేమి చేయటమా అని ఆలోచించేంతలో, మోకు సాయంతో లోయలోకి దిగిన విక్రమకేసరి, అతణ్ణి "శిఖీ!" అని పిలిచాడు.

శిఖిముఖి ఆ పిలుపు వింటూనే అదిరి పడి, వెనక్కు తిరిగాడు. విక్రమకేసరి అతడి భుజంమీద చేయి వేసి చిన్న



గొంతుతో, "ఏం, ఆ దుర్మార్గుడు నీకు అందకుండా పారిపోయాడా?" అని ప్రశ్నించాడు.

"అందకపోవటమే కాదు, వాడు నా కంటికే కనిపించలేదు. దూరాన గుర్రం పరిగెత్తిపోయిన శబ్దం మాత్రం విన్నాను,' అన్నాడు శిఖిముఖి.

"వాడుగానీ, ఆ భేరుండంగానీ నాగుమల్లిని గుర్రం మీద వేసుకుని త్వరత్వరగా యీ ప్రదేశం వదిలి పారిపోయివుంటారు. అలా జరిగివుంటే మాత్రం ఆ పూజారిగాడికి యిక్కడ సహాయపడేందుకు మరికొందరు మనుషులు వుండి వుండాలి. లేకపోతే



గుర్రం ఎక్కణ్ణుంచి వస్తుంది!" అన్నాడు విక్రమకేసరి.

"అంతే అయియుండాలి. మనం మాటలతో కాలయాపన చేయటం ఎందుకు. యీ చుట్టుపక్కల వాళ్ళకోసం వెతుకుదాం. మనవాళ్ళందరూ కొండ దిగి వస్తున్నారు గదా?" అన్నాడు శిఖిముఖి.

"వస్తున్నారు. వాళ్ళు యిక్కడికి చేరేందుకు కొంత ఆలస్యం అవుతుంది. నువ్వు గుర్రం పరిగెత్తిపోయిన ధ్వని ఏ దిక్కుగా విన్నావు?" అని అడిగాడు విక్రమకేసరి.

శిఖిముఖి వున్న చోటు నుంచి కదిలి, అక్కడికి దాపుల నున్న చెట్ల కేసి చేయి చూపాడు. ఇద్దరూ అటు కేసి నిశ్శబ్దంగా బయలుదేరారు. ఆ ప్రదేశం లోయకు కొంచెం ఎగువగా వున్నది. అంత చీకటి లోనూ చెట్ల మధ్య నుంచి సన్నని కాలి బాట ఒకటి వాళ్ళ కంట బడింది. ఆ బాట వెంట వాళ్ళు కొంతదూరం వెళ్ళేసరికి, బాటకు పక్కగా వున్న పొదల చాటు నుంచి చిన్న వెలుగు వాళ్ళకు కనిపించింది.

శిఖిముఖి, విక్రమకేసరికి ఆ వెలుగు చూపి, "ఎవరో ఆ పొదల వెనక నెగడు వేసుకుని కూర్చున్నట్టున్నది. అరణ్య





మృగాల భయంకొద్దీ, యీ ప్రాంతాల దొంగలైనా దొరలైనా రాత్రివేళల్లో నిప్పు ముందు కాలక్షేపం చేయవలసిందే. వీళ్ళెవరో తెలుసుకుందాం," అంటూ పొదల చాటునే నక్కుతూ ముందుకు కదిలాడు.

శిఖిముఖి, విక్రమకేసరీ ఆ నెగడు వున్న చోటుకు దాపుల నున్న పొదల వెనక్కు పోయేసరికి, వాళ్ళకు నెగడు ముందు ఇద్దరు మనుషులు కనిపించారు. వాళ్ళ దుస్తుల తీరూ అదీ చూస్తూంటే, వాళ్ళు అడవి దొంగలలా వున్నారు. వాళ్ళు లోకం మాటే మరిచి కాళ్ళ ముందు పరుచుకున్న వస్త్రం మీద కుప్పగా పోసివున్న వెండి కాసుల్ని లెక్కిస్తున్నారు.

శిఖిముఖి, విక్రమకేసరిని, ఆ దొంగల వెనక వున్న పొదల చాటుకు వెళ్ళమని చెప్పి, తాను పొదల చాటు నుంచి కత్తి దూసి వాళ్ళ ముందుకుపోతూ, "ఉన్న చోటు నుంచి కదలకండి, జాగ్రత్త!" అని గట్టిగా హెచ్చరించాడు.

దొంగ లిద్దరూ అదిరిపడి, కత్తులు దూయబోయిన వాళ్ళల్లా శిఖిముఖిని చూస్తూనే ఓ క్షణకాలం తటపటాయించారు. ఆ అదనులో విక్రమకేసరి పొదల చాటు నుంచి వాళ్ళ వెనగ్గా వచ్చి నిలబడి, కత్తిని



వాళ్ళ కంఠాల మీద ఆడిస్తూ, "జాగ్రత్త, కదలకండి!" అంటూ హుంకరించాడు.

దొంగలు ఆ హెచ్చరికతో కుక్కిన పేనుల్లా అయిపోయారు. శిఖిముఖి వాళ్ళను సమీపించి, ఒరల నుంచి కత్తులు లాగి దూరంగా విసిరివేస్తూ, "శిథిలాలయ పూజారి ఎక్కడ?" అని ప్రశ్నించాడు.

ఆ ప్రశ్న వింటూనే దొంగల్లో ఒకడు అమాయకుడిలా ముఖం పెట్టి, "శిథిలాలయ పూజారా? ఆ పేరే వినలేదే!" అన్నాడు.

"ఆ పేరు వినటమేగాదు, ఆ దుర్మార్గుడి నుంచే యీ వెండి కాసులన్నీ సంపాయించారు. మోసం చెయ్యాలని చూడ



కండి," అని, విక్రమకేసరితో, "కేసరీ! వీళ్ళ చేత నిజం చెప్పించటం ఏమంత కష్టం కాదు. పారిపోవాలని ప్రయత్నించిన వాణ్ణి నిర్దాక్షిణ్యంగా కత్తితో నరుకు," అని చెప్పి, దొంగల్లో ఒకడి తలకు వున్న వస్త్రాన్ని లాగి, దానితో వాడి చేతులను వెనక్కు విరిచికట్టాడు శిఖిముఖి.

"ఇప్పుడు నిజం చెప్పబోతున్నారు, తెలిసిందా?" అని శిఖిముఖి నెగడు నుంచి కాలే కట్టె ఒకటి తీసుకుని, ఒక దొంగ వాడి కేసి ముందుకొక అడుగు వేశాడు.

రానున్న ప్రమాదాన్ని గుర్తించగానే దొంగ లబోమంటూ, "అయ్యో, నన్ను



కాల్చి చంపకండి. ఆ పూజారి ఎక్కడున్నాడో తెలీదు. అతడికి ఒక గుర్రాన్ని అమ్మాం. ఆ డబ్బు పంచుకుంటున్నాం," అన్నాడు.

"నీకు తెలిసింది యింతే నన్నమాట. సరే, నీ స్నేహితుడికి మరికొంత తెలిసి వుంటుంది," అంటూ శిఖిముఖి కాలే కట్టెను రెండవ దొంగ మీదికి గురి చేశాడు.

ఈసారి ఆ రెండవ దొంగ ఒక చావు కేక పెట్టి, "అయ్యో, నన్ను కాల్చకు. అంతా నిజం చెబుతాను. ఆ పూజారి వెంట దుక్కలాంటి నపరవా డొకడున్నాడు. వాడు చాపలో చుట్టి తెచ్చిన ఒక మనిషిని పూజారి గుర్రం మీద వేసుకుని అరణ్యంలోకి దౌడు తీశాడు. ఇంతే మాకు తెలిసింది," అన్నాడు.

"కాదు, మీకింకా చాలా తెలుసు. కేసరీ, నువ్వో ఒక నిప్పు కట్టె అందుకో," అన్నాడు శిఖిముఖి.

విక్రమకేసరి నెగడులో నుంచి బాగా మండుతున్న కట్టె నొకదాన్ని తీసుకుని మొదటి దొంగను సమీపిస్తూ, "వీపు కాల్చటం కంటె తల కాలిస్తే వీళ్ళకు మరి కాస్త సుఖంగా వుంటుంది," అని కట్టెను మొదటి దొంగ తలమీద పెట్టబోయాడు.

దొంగ గడగడ వణికిపోతూ, "అయ్యల్లారా, మమ్మల్ని హింసించకండి. ఇప్పుడు







"మా కింతకన్నా ఏం తెలియదు. రక్షించండి," అంటూ దొంగలు గగ్గోలు ప్రారంభించారు. శిఖిముఖి, విక్రమకేసరిని వారించి, "వీళ్లు నిజంచెపుతున్నట్టే వున్నది. పాపం, నాలుగు రాళ్ళ కోసం గుర్రాన్ని ఆ పూజారికి అమ్మటం నేరం కింద జమ కట్టలేంకదా," అని, దొంగలతో, "సరే, ఇక మీ చావేదో మీరు చావండి. ఒకవేళ మీ కెప్పుడైనా ఆ పూజారిగాని, నవర వాడు...వాడి పేరు భేరుండంగాని కని పించితే, ఆ సంగతి కుంభారమిట్ట పల్లెలో చెప్పాలి. అలాచేయ్యక పోయారో మీ చర్మం వలిచి తీరుతాను," అన్నాడు.

మాకు తెలిసినదంతా చెప్పేస్తాం. ఆ పూజారీ, అతడి నౌకరూ మాట్లాడుకునేదాన్నిబట్టి, వాళ్ళు రాత్రికిరాత్రే బయలుదేరి బ్రహ్మ పుత్రానదీ ప్రాంతాలకు వెళ్ళిపోతున్నట్టు తెలిసింది. సత్యం చెబుతున్నాను. ఆ పైన కొండదేవతే సాక్షి!" అన్నాడు.

"శిఖీ, యీ వెధవలు బ్రహ్మపుత్రానది యీ పక్కన ఎక్కడో వున్నదను కుంటున్నారులావుంది ఒళ్ళు కాలితే తప్ప నిజం చెప్పరు," అంటూ విక్రమకేసరి శిఖిముఖి చేతులో వున్న నిప్పు కట్టెను కూడా లాక్కుని, యిద్దరు దొంగల తలల మీదా ఆనించబోయాడు.

"అయ్యో, మీరు ప్రాణదాతలు. మాటి స్తున్నాం. ఆ పూజారి కనిపిస్తే అగమేగాల మీద వచ్చి, మీ పల్లెలో ఆ సంగతి చెపుతాం," అన్నాడు దొంగల్లో ఒకడు.

శిఖిముఖి అంగీకార సూచకంగా తలా డించి, విక్రమకేసరిని వెంట బెట్టుకుని చెట్లల్లోకి కొంతదూరం పోయి ఆగి, "కేసరీ, ఈ దొంగలు మనతో చెప్పకుండా దాచిన ముఖ్య రహస్యం ఒకటున్నదని నా కను మానం కలుగుతున్నది. పూజారికి గుర్రాన్ని అమ్మిన మాట నిజం. కాని, వాడెక్కడ వున్నదీ తమకు తెలియదనటం పూర్తి





అబద్ధం. ప్రాణభయం పెట్టినా మనను వాళ్ళు అబద్ధాలతో పక్కదార్లు తొక్కించ వచ్చు. అందుకని, నేను వాళ్ళను వెంబడించి ఎటుపోయేదీ తెలుసుకోదలిచాను. నువ్వు, యీ ప్రాంతాల్లోనే వుండి, మన వాళ్ళు రాగానే, వాళ్ళను నాలుగు దిక్కులకూ పూజారిని వెతికేందుకు పంపి, యీ సమీపంలోనే నా కోసం కాచుకుని వుండు," అన్నాడు.



విక్రమకేసరి సరే నన్నాడు. ఆ వెంటనే శిఖిముఖి దొంగలున్న చోటుకు పోయాడు. అతడు పొదలచాటు నుంచి వాళ్ళేమి చేస్తున్నదీ చూసేంతలో దొంగలు డబ్బును రెండు చిన్న మూటలుగా కట్టి, నడుముకు వేలాడ వేసుకుని, పొదల్లో వెతికి, పోయిన కత్తుల్ని సంపాయించి, నవ్వుకుంటూ అరణ్యంలోకి వున్న కాలిబాట వెంట బయలుదేరారు. శిఖిముఖి నిశ్శబ్దంగా వాళ్ళను అనుసరించాడు.

విక్రమకేసరి చీకట్లో అటూ యిటూ పచార్లు చేస్తూ తన అనుచరుల రాకకోసం ఎదురు చూడసాగాడు. ఓ పావు గంట గడిచింది. హఠాత్తుగా అతడికి లోయ దిగువ ప్రాంతం నుంచి కుక్క అరవటం వినబడింది. ఆ అరుపు శిఖిముఖి వేటకుక్క ఎర్రగండుదని అతడు గ్రహించాడు. దాని అర్థం కుంభారమిట్ట నుంచి శివాలుడుగాని, లేక శిఖిముఖి బంధువుల్లో మరెవరైనాగాని అటువస్తున్నారన్న మాట.

అతడు చప్పున కదిలి కుక్క అరుపు వినబడిన వైపుకు నడవసాగాడు. కొద్దిసేపట్లోనే అతడికి లోయ పైకి ఎక్కి వస్తున్న శివాలుడూ, గండుపోతూ వాళ్ళ వెంట నలుగు రైదుగురు శబర సవర వాళ్ళూ కనిపించారు. ఒక శబరుడు ఎర్రగండు మెడ నున్న తాడు పట్టుకుని వున్నాడు. కుక్క తాడును గుంజుతూ ముందుకు పరిగెత్తాలని పెనుగులాడుతున్నది.



శివాలుడు, విక్రమకేసరిని చూస్తూనే, "కేసరీ, క్షేమంగా వున్నావా? శిఖి ఎక్కడ? నాగుమల్లిని ఆ దుర్మార్గుడైన పూజారి ఎత్తుకు పోయిన మాట నిజమా?" అని ప్రశ్నించాడు.

విక్రమకేసరి జవాబు చెప్పబోయేంతలో, సవరగండుపోతు పెద్దగా గొంతెత్తి, "ఆ పూజారి నీచుణ్ణి ప్రాణాలతో చర్మం ఒలిపిస్తాను. వాడెక్కడ?" అన్నాడు ఆవేశ పడిపోతూ.

శివాలుడు అతడి భుజం పట్టుకుని, "తొందరపడకు, గండుపోతూ! ముందు సంగతి సందర్భాలు తెలుసుకోనీయ్," అన్నాడు శాంతపరుస్తూ.

విక్రమకేసరి తాము అరణ్యంలో ప్రవేశించి, బడేచెంచు నివసించే ఆకాశగుహ చేరటం, అక్కడ జరిగిన గొడవలూ—అన్నీ టూకీగా చెప్పి, చివరకు శిఖిముఖి దొంగలను అనుసరించి పోవటం సంగతి తెలియపరిచాడు.

"ఒంటరిగా ఆ అడవి దొంగలను వెంబడించటంలో కొంత ప్రమాదం వున్నా, శిఖిముఖి తెలివైన పనే చేశాడు. ఏమైనా యీ చీకట్లో ఆ పూజారిని పట్టుకోవటం సాధ్యమయే పని కాదు. తెల్లవారిం తరవాత ఈ అరణ్యాలూ, కొండలూ వాడికోసం గాలించవలసి వున్నది," అని, శివాలుడు గండుపోతుతో, "నువ్వేమీ దిగులు పడకు. నాగుమల్లి ఆ దుర్మార్గుణ్ణించి స్వశక్తితోనే బంధవిముక్తురాలు కాగలదని నా నమ్మకం. అలా జరగకపోయినా, పూజారి మన వలలో చిక్కకుండా పోడు," అన్నాడు.

శివాలుడు మాట ముగించీ ముగించక ముందే, లోయ పక్కనే వున్న ఒక ఎత్తయిన ప్రదేశం నుంచి భగభగ మండుతున్న దివిటీ కనిపించింది. ఎవరో దాన్ని గాలిలో వూపుతున్నారు. శివాలుడూ అతడి వెంట వున్న వాళ్లూ అటు కేసి చూసేంతలో, సన్నని ఈల వినిపించింది. —(ఇంకా వుంది)






# విషప్రయోగం

పట్టువదలని విక్రమార్కుడు చెట్టు వద్దకు తిరిగి వెళ్ళి, చెట్టు పై నుంచి శవాన్ని దించి భుజాన వేసుకుని, ఎప్పటిలాగే మౌనంగా శ్మశానం కేసి నడవసాగాడు. అప్పుడు శవం లోని బేతాళుడు, "రాజా, నీ వంటి వారిపై సాధారణంగా కుట్రలు జరుగుతూంటాయి. దాని ఫలితంగానే నువ్వీ అపరాత్రివేళ ఇన్ని పాట్లకు గురి అవుతూ ఉండవచ్చు. నీకు శ్రమతెలియకుండా ఉండగలందులకు ఉజ్జయినీ రాజుపై జరిగిన కుట్ర గురించి చెబుతాను విను," అంటూ ఇలా చెప్పసాగాడు:

ఒకప్పుడు ఉజ్జయినీ నగరంలో వజ్ర గుప్త డనే వజ్రాల వర్తకు డుండేవాడు. అతను అపూర్వమైన వజ్రాలను మాత్రమే కొనేవాడు, అమ్మేవాడు. అతని వజ్రాలను రాజులూ, మహారాజులూ మాత్రమే కొనే వారు. అపూర్వమైన వజ్రాలు ఎక్కడ

## బేతాళ కథలు



ఉన్నట్టు వార్త వచ్చినా వజ్రగుప్తుడు సముద్రాలు సైతం దాటి వెళ్ళి, వాటిని ఖరీదు చేసేవాడు.

ఒకసారి అతను క్రౌంచద్వీపంలో "శిరీషకం" అనే గొప్ప వజ్రాన్ని కొన్నాడు. దాన్ని యాభై లక్షల వరహాలకు అమ్మాలని అతను నిశ్చయించుకుని స్వదేశానికి తిరిగి వచ్చాడు.

వజ్రగుప్తుడి వద్ద శిరీషకం ఉన్న వార్త తెలిసి ఉజ్జయినీ రాజు అతన్ని పిలిపించి, వజ్రాన్ని పరీక్షించాడు. రాజుకు అది అపూర్వమైన వజ్రం అన్న నమ్మకం కలగగానే దాన్ని కొనాలని బుద్ధిపుట్టింది.

"వజ్రగుప్తా, ఈ మణిని కొనదలిచాం. పాతికలక్షల వరహాలకు మాకు అమ్మెయ్యి," అన్నాడు రాజు.

వజ్రగుప్తుడి గుండెలో రాయి పడింది. తానా వజ్రానికి నిశ్చయించిన ధరలో సగమే రాజు ఇస్తానంటున్నాడు. రాజు ఒక ధర చెప్పినాక అంతకు మించి అడగటం అమర్యాద అవుతుంది. ఇవ్వనంటే రాజుకు కోపం వస్తుంది. అందుచేత వజ్రగుప్తుడు ఏమీ అనలేకపోయాడు.

అది చూసి రాజు, "మేము చెప్పిన ధర నీకు నచ్చలేదు లాగుంది?" అన్నాడు.

"అదేమీ లేదు, మహారాజా. ఇది గ్రహ ప్రభావం గల వజ్రం. కొన్ని జన్మనక్షత్రాలు గల వారికే ఇది ఉపకరిస్తుంది. మరి కొందరికి నష్టమూ, కొన్ని జన్మనక్షత్రాల వారికి ప్రాణాపాయమూ కూడా కలిగించ గల వజ్రం ఇది. అందుకే సందేహిస్తున్నాను," అన్నాడు వజ్రగుప్తుడు.

అతను అబద్ధం చెబుతున్నాడని రాజు గ్రహించి, తన జన్మనక్షత్రం చెప్పి, "నా కిది ఎలాటి ఫలితాన్ని కలిగిస్తుం దంటావు?" అన్నాడు.

వజ్రగుప్తుడు చప్పున, "మహారాజా, తమ కిది ప్రాణహాని కలిగించ వచ్చు. దీన్ని

మీరు కొనటం మంచిది కాదు," అన్నాడు. అదే జన్మనక్షత్రం గల మరొక వర్తకుడు ఆ వజ్రాన్ని కొన నిరాకరించినట్టు కూడా అతను రాజుతో అన్నాడు.

రాజు నవ్వి, "నాకా భయాలు లేవు. అన్నిటికీ తెగించి నేనీ వజ్రాన్ని కొన దలిచాను. అందుచేత నువు నిశ్చింతగా దీన్ని మాకు అమ్మవచ్చు," అన్నాడు.

వజ్రగుప్తుడు శిరీషకాన్ని రాజుకు అమ్మక తప్ప లేదు.

ఈ సంగతంతా రాజకుమారుడైన ప్రసేనుడికి తెలియ వచ్చింది. ప్రసేనుడు యువరాజు. అతను సూక్ష్మబుద్ధి గలవాడే గాని దుర్మార్గుడు. అతను వజ్రగుప్తుడి వద్దకు వెళ్ళి, "ఏం, వజ్రగుప్తా. మహారాజు గారు నీ వజ్రాన్ని చాలా చౌకగా కాజేసి నట్టున్నారే! దానివల్ల ప్రాణగండం ఉన్న దని నువు భయపెట్టినా ఆయన భయపడ లేదుట. అదీ ఒకందుకు మంచిదే అయింది. నువు నాకు ఒక చిన్న సహాయం చేశావంటే, నీ వజ్రం నీకు తిరిగి లభిస్తుంది. దానికని నువు పుచ్చుకున్న పాతిక లక్షలూ తిరిగి ఇవ్వ నవసరం కూడా ఉండదు. నేను చెప్పినట్టు చేస్తావా?" అన్నాడు.

"ఏమిటి తమ ఆజ్ఞ?" అన్నాడు వజ్ర గుప్తుడు అనుమానంగా.





"ఈ రాజు ఇంతలో చావడు. నేనిప్పట్లో సింహాసనం ఎక్కే మార్గం లేదు. ఏ ఉపాయం చేతనైనా మనం ఆయనను చంప గలిగితే అనుమానం ఇప్పుడు వజ్రం మీదికి పోతుంది. అది కొంటే రాజుకు ప్రాణాపాయం కలగ వచ్చునని నువ్వు చెప్పనే చెప్పావు గద. వజ్రపు పొడి ప్రాణాలు తీస్తుందని విన్నాను. మామూలు విషాలలాగా దానికి రుచీ వాసనా ఉండదు. వజ్రపుపొడి ఉంటే ఇయ్యి. పాలలో కలిపి రాజుగారికిస్తాను," అన్నాడు యువరాజు.

వజ్రగుప్తుడు కొంచెం ఆలోచించి, "నా దగ్గిర వజ్రపుపొడి ఉన్నది. కాని దాన్ని రాజుగారికి తమరే స్వయంగా పాలలో ఇవ్వాలి. ఈ పని మరొకరికి పెట్టకండి," అన్నాడు.

అందుకు ప్రసేనుడు ఒప్పుకుని, వజ్రగుప్తుడి దగ్గిర వజ్రపుపొడి పొట్లం తీసుకుని వెళ్ళిపోయాడు.

ఇది జరిగిన వెంటనే వజ్రగుప్తుడు రహస్యంగా మహారాజును కలుసుకుని, "మహారాజా, తమరు చాలా హెచ్చరికగా ఉండాలి. తమకు విషప్రయోగం చెయ్యాలని తమ శత్రువులు యత్నిస్తున్నారు, ముందుగా వైద్యుల చేత పరీక్షింపకుండా తమరు ఏదీ తాగ వద్దని నా విన్నపం," అని సలహా ఇచ్చాడు.

ఇది తన మేలుకోరి ఇచ్చిన సలహాయే కాబట్టి రాజు తాను తినే ఆహారాన్నీ, తాగే పానీయాలనూ తన అంతరంగ వైద్యుడి చేత ముందుగా పరీక్షింప చేయటం ప్రారంభించాడు.

ఒక రోజు రాత్రి, రాజుగారు పడుకోబోయే ముందు ఆయన తాగే పాలను ప్రసేనుడే తెచ్చి ఇచ్చాడు.

"నా పాలు నువే తీసుకువచ్చావా, నాయనా? పనివాడేమయాడు?" అంటూ రాజు పాలలోటా అందుకుని నోటి కెత్తు

కున్నాడు. కాని అంతలోనే ఆయనకు వజ్రగుప్తుడి హెచ్చరిక గుర్తుకు వచ్చింది. ఆయన పాలలోటా తీసుకుని తన రహస్య మందిరంలోకి వెళ్ళిపోయాడు. అక్కడ వైద్యుడా పాలను పరీక్షించి, అందులో వజ్రపుపాడి కలిసినట్టు కనుక్కున్నాడు.

మర్నాడే రాజు తన యువరాజును రాజద్రోహిగా విచారణ చేసి, యావజ్జీవ కారాగార శిక్ష విధించి, తన ప్రాణాలను కాపాడిన వజ్రగుప్తుడికి అంతులేని కానుక లిచ్చాడు.

బేతాళుడీ కథ చెప్పి, "రాజా, వజ్రగుప్తుడు ప్రసేనుడి యత్నాన్ని ఎందుకు పాడు చేశాడు? అందువల్ల తనకు నష్టమే తప్ప లాభం లేదే? ఈ సందేహానికి సమాధానం తెలిసి కూడా చెప్పక పోయావో నీ తల పగిలిపోతుంది," అన్నాడు.

దానికి విక్రమార్కుడు, "వజ్రగుప్తుడు రాజద్రోహి కాడు. అతను యువరాజుకు వజ్రపుపాడి ఇచ్చిన మాట నిజమే. తాను వజ్రపుపాడి నిరాకరించిన మాత్రాన యువరాజు రాజును హత్యచేయక మానడు. రాజు చస్తే అందరూ శిరీషకాన్నే నిందిస్తారు. దాన్ని గురించి తాను రాజుతో ఆడిన అబద్ధం యువరాజును కాపాడుతుంది. అందుచేత, తనకు లాభం లేకపోయినా రాజు ప్రాణం కాపాడటం తన విధి అని వజ్రగుప్తుడు భావించి, రాజును హెచ్చరించాడు. ఇందువల్ల అతను తనను తాను రక్షించుకున్నవాడూ అయినాడు. ఏమంటే, రాజ్యం కోసం తండ్రిని చంపటానికి సిద్ధపడిన ప్రసేనుడు రాజయాక, తన రహస్యం తెలిసిన వజ్రగుప్తుణ్ణి బతికి ఉండనిస్తాడా? ఏ విధంగా చూసినా వజ్రగుప్తుడి ప్రవర్తన సమంజసంగానే ఉన్నది," అన్నాడు.

రాజుకీ విధంగా మౌనభంగం కలగగానే బేతాళుడు శవంతో సహా మాయమై, తిరిగి చెట్టెక్కాడు. —(కల్పితం)



# కోతల నిపుణుడు

ఒక దేశంలో ఒక ధనికు డుండేవాడు. అతని సరదా అబద్ధాలు కల్పన చెయ్యటమూ, గప్పాలు కొట్టటమూనూ.

ఒకసారి ఈ ధనికుడికి ఒక బండీవాడు కావలసి వచ్చాడు. బండి తోలే పని చేస్తానని వచ్చినవాడితో ధనికుడు, "ఒరే, నీకు కల్పించి మాట్లాడటం చాతవునా?" అని అడిగాడు.

"అవసరమైతే చాతగాకేం చేస్తుంది?" అన్నాడు బండివాడు.

"ఎందుకంటే నేను కోతలుకోసేటప్పుడు కొంచెం తడువుకుంటాలే," అన్నాడు యజమాని.

కొన్నాళ్ళయాక యజమాని మరో గ్రామానికి వెళ్ళి అక్కడి మునసబుతో మాట్లాడుతూ, "ఓసారి ఏమయిందనుకున్నారు. గాలిలో మూడు కుందేళ్ళను కొట్టాను," అన్నాడు.

"అసంభవం!" అన్నాడు మునసబు.

"నా మాట నమ్మకపోతే మా బండివాణ్ణి అడగండి," అంటూ ధనికుడు బండివాణ్ణి పిలిచి, "ఒరే, నేను గాల్లో మూడు కుందేళ్ళను కొడితినే, ఆ సమాచారం మునసబుగారికి చెప్పు," అన్నాడు.

"అదా, బాబయ్యా? అదెలా జరిగిందంటేనండి, మా బాబుగారు వేటకి బయల్దేరాడు. కంచె మీదిగా కుందేలు ఎగిరింది. అది కింద పడేలోగా బాబుగారు కొట్టేశారు. తరవాత దాన్ని కోస్తేనండి, దాని పొట్టలో రెండు కుందేళ్ళున్నాయండి!" అన్నాడు బండివాడు.

"అలా చెప్పు!" అన్నాడు మునసబు బండివాడి కోత నమ్మి.





# అపవాదు

సాకేతపురంలో ఒక ధనిక వర్తకు డుండే వాడు. అతనికి సుమతీ, సునీత అని ఇద్దరు పిల్లలుండేవారు. చిన్న తనంలోనే తల్లిని పోగొట్టుకున్న ఆ కొడుకునూ, కూతురినీ తండ్రి ఎంతో ప్రేమగా పెంచి, చక్కగా చదువు చెప్పించాడు. ఆయన తన అవసాన దశలో సుమతిని పిలిచి, "నాయనా, నేను వర్తకం చేసి లక్షలు గడించాను. కాని నా కాలం ముగిసింది. మనం ఎంత ధన వంతులమైనా, నువు ఇంట్లోనే కూర్చుని ఉంటే మన ధనం త్వరలోనే హరించి పోతుంది. కనుక నా అనంతరం వర్తకం పని నువు చూడాలి. శ్రీపురంలో నాకు పరమ మిత్రుడైన వర్తకు డొక డున్నాడు. ఒక తల్లి బిడ్డలం కాక పోయినా మేమిద్ద రమూ అన్నదమ్ముల కన్న అన్యోన్యంగా ఉన్నాం. అతని పేరు లక్ష్మిగుప్తుడు. కొంత కాలంపాటు అతను నీకు వర్తక విధానాలు నేర్పుతాడు. నీకు ఎలాటి చిక్కు వచ్చినా అతను ఆదుకుంటాడు," అని చెప్పాడు.

సుమతి, తండ్రి మరణించాక ఆయనకు ఉత్తరక్రియలు చేసి, పెద్ద ఎత్తున దానాలు ఇచ్చి, కర్మకాండ ముగిసిన కొన్ని రోజుల అనంతరం సునీతతో, "చెల్లీ, నేను ఇంట్లో ఉండి ప్రయోజనం లేదు. నాన్న చెప్పిన ప్రకారం తిరగాలి, క్రయవిక్రయాలు చేసి, వర్తకం కొనసాగించాలి. ముందు శ్రీపురం వెళ్ళి లక్ష్మిగుప్తుణ్ణి కలుసుకోవాలి," అన్నాడు.

"నువు వెళ్లితే నేను ఒక్కత్తెనూ ఎలా ఉండగలను? మనిద్దరమూ ఘడియ సేపైనా ఒకరినొకరం ఎడబాసి ఉండలేదు గద!" అన్నది సునీత.

కాని అతను వెళ్ళక గత్యంతరం లేదు. అందుచేత అతను తన చెల్లెలికి తోడుగా ఉండటానికి ఒక వయసు మళ్ళిన దాసీని ఏర్పాటు చేసి, తన చిత్తరువు తన చెల్లెలి

ఎ. నాగేంద్రరావు



కిచ్చి, ఆమె చిత్తరువు తాను తీసుకుని, తన తండ్రి తాలూకు బిడారును వెంట పెట్టుకుని శ్రీపురం వెళ్ళాడు.

అతని తండ్రి మరణవార్త వింటూనే లక్ష్మీగుప్తుడు చిన్న పిల్లవాడిలాగా ఏడిచాడు. ఆయనకు పిల్లలు లేరు. సుమతి లాటి స్ఫురద్రూపి అయిన యువకుడు తమ ఇంట్లో ఉండటం లక్ష్మీగుప్తుడికీ, ఆయన భార్యకూ ఎంతో ముచ్చట అయింది.

లక్ష్మీగుప్తుడు అపార ధన సంపన్నుడే గాక శ్రీపురరాజుకు చాలా ఇష్టుడు. అందుచేత ఆయన రాజభవనానికి వెళుతూ సుమతిని తన వెంట తీసుకుపోయి రాజుగారికి పరిచయం చేశాడు. రాజు సుమతి తండ్రిని కూడా ఎరుగును, అందుచేత ఆయన సుమతి పట్ల ఆదరం చూపాడు.

రాజుగారికి ప్రతాపుడు ఒక్కడే సంతానం. అతను చాలా స్నేహపాత్రుడు. అతనికీ, సుమతికీ త్వరలోనే దృఢమైన స్నేహం ఏర్పడింది. ఆ కారణంగా సుమతి రాజభవనానికి దాదాపు రోజూ వెళుతూ, అక్కడే భోజనం చేస్తూ, గంటల తరబడి ప్రతాపుడితో ఇష్టాగోష్ఠి జరిపేవాడు.

ఇలా కొంతకాలం జరిగాక సుమతి లక్ష్మీగుప్తుడితో, "చిన్నాయనా, నేను ఇన్నిసార్లు రాజభవనానికి ప్రతాపుడి అతిథిగా వెళ్ళాను, అతన్ని ఒకసారి పిలిచి, ఆతిథ్యం ఇవ్వటం బాగుంటుంది గదా?" అన్నాడు.

"తప్పక ఆహ్వానింతాం, బాబూ," అన్నాడు లక్ష్మీగుప్తుడు.

సుమతి ఆహ్వానాన్ని ప్రతాపుడు ఆమోదించాడు. రాజూ, రాణీ అతన్ని అనుమతించారు.

ప్రతాపుడు వచ్చేనాడు లక్ష్మీగుప్తుడు బ్రహ్మాండమైన ఏర్పాట్లు చేశాడు. రాజభవనం నుంచి తన ఇంటిదాకా దారి అంతటా తివాసీలు పరిపించాడు. రాజోచితమైన పంటకాలూ, పానీయాలూ, వినోదాలూ

ఏర్పాటు చేశాడు. ప్రతాపుడికి రోజు క్షణం లాగా గడిచిపోయింది. స్నేహితుడి ప్రోద్బలం మీద అతను ఆ రాత్రికి లక్ష్మిగుప్తుడి ఇంటనే ఉండి పోయాడు. ఆ రాత్రి స్నేహితు లిద్దరూ సుమతి పడుకునే గదిలోనే పడుకున్నారు.

పడుకో బోయేటప్పుడు సుమతి, గోడకు వేళ్ళాడుతున్న సునీత చిత్తరువుకేసి చూడటం గమనించాడు ప్రతాపుడు. అతని దృష్టి కూడా ఆ చిత్తరువు మీద పడింది. మరుక్షణం అతనిలో ఆమె పైన అంతులేని వ్యామోహం పుట్టుకొచ్చింది. అతను ఆ రాత్రి నిద్ర పోలేదు.

మర్నాడు వెళ్ళిపోయేటప్పుడు ప్రతాపుడు చాలా ముభావంగా ఉండటం గమనించి, "మిత్రమా, నిన్నసల్లా ఎంతో సరదాగా ఉన్నావు, ఇంతలోనే అలా ముడుచుకు పోయావేమిటి? నావల్ల ఏదన్నా తప్పు జరిగితే చెప్పు, దిద్దుకుంటాను," అన్నాడు సుమతి.

"నీ రహస్యాలు నా దగ్గిర ఎందుకు దాచావు?" అన్నాడు ప్రతాపుడు.

"దాచటానికి నాకు రహస్యా లేమీ లేవే! నీ దగ్గిర అసలే లేవు," అన్నాడు సుమతి.

"ఆ చిత్తరువు ఎవరిది? నువు నిన్న రాత్రి దానికేసి చూడటం గమనించాను.





ఎంత అందమైన ముఖం! ఆమెను గురించి నాకు మాట మాత్రం చెప్పావా?" అన్నాడు ప్రతాపుడు.

సుమతి గట్టిగా నవ్వి, "ఆమె నా చెల్లెలు సునీత! సునీత గురించి నీకు చెప్ప లేదా?" అన్నాడు.

సుమతికి సునీత అనే చెల్లె లున్నట్టు ప్రతాపుడికి తెలుసుగాని, ఆమె అప్సరస లాటిదని అతను కలలో కూడా ఊహించ లేదు. ఆమెను పెళ్ళాడక తాను జీవించ లేనని ప్రతాపుడికి తోచింది.

ఇంటికి తిరిగి వచ్చి, మాటా పలుకూ లేకుండా, నీరసంగా పడుకున్న కొడుకును చూసి రాజూ, రాణీ ఆందోళన చెందారు. లక్ష్మీగుప్తుడి ఆతిథ్యంలో ఏదో లోపం జరగటం చేతనే కొడుకు ఇలా అయాడని వారికి తోచింది.

తల్లీ, తండ్రీ గుచ్చి గుచ్చి అడిగిన మీదట ప్రతాపుడు, "సుమతి చెల్లెలు సునీతను నా కిచ్చి పెళ్ళి చెయ్యకపోతే నేను నిశ్చయంగా కృశించి చచ్చిపో తాను," అన్నాడు.

"ఎందరో గొప్ప గొప్ప రాజకుమార్తె లుండగా ఒక మామూలు వర్తకుడి కూతుర్ని చేసుకుంటా ననటానికి నీకు సిగ్గు లేదూ?" అని ప్రతాపుణ్ణి తల్లి మంద లించింది.

"నాకా రాజకుమార్తె లక్కర్లేదు, సునీతే కావాలి," అన్నాడు ప్రతాపుడు.

చేసేదిలేక రాజు లక్ష్మీగుప్తుణ్ణీ, సుమతినీ పిలిపించి, సుమతితో, "మావాడు నీ చెల్లెలిని పెళ్ళాడతానంటున్నాడు. అందుకేమైనా అభ్యంతరం ఉంటుందా?" అని అడిగాడు.

"అభ్యంతరమా? ప్రతాపుడి కన్న నాకు అప్తు డెవరు? అతను చేసుకుంటానంటే నా చెల్లెల్ని పువ్వుల్లో పెట్టి ఇచ్చుకుంటాను," అన్నాడు సుమతి.

సుమతి అన్న మాటలు చెవిని పడ గానే ప్రతాపుడు ఉత్సాహంతో లేచి కూర్చున్నాడు.

రాజు తన మంత్రి అయిన నాగామాత్యుణ్ణి పిలిచి, "అబ్బాయి పెళ్ళి నిశ్చయించాం. ఏర్పాట్లన్నీ చేయించు," అన్నాడు.

నాగామాత్యుడికి ఈ లోపలనే సంగతంతా తెలిసింది. ఈ పిల్ల సాటిలేని సౌందర్యవతి అయితే ఆమెను రాజుకొడుకు చేసుకునే కన్న తానే చేసుకుంటే బాగుంటుందని నాగులుకు తోచింది. అందుకని అతను ఈ పెళ్ళి పడగొట్టటానికి సాహసించి, "మహారాజా, మీరు తొందర పడటం మంచిది కాదేమో. మీరు చెప్పే పిల్లకు సాకేతపురం నిండా ప్రియులున్నట్టు విన్నాను," అన్నాడు.

రాజుకు పట్టరాని ఆగ్రహం వచ్చింది. ఆయన లక్ష్మిగుప్తుణ్ణీ, సుమతినీ మళ్ళీ పిలిపించి, "నేను మీ పిల్లను నా కొడుక్కు చేసుకుంటానన్నప్పుడు, ఆ పిల్ల శీలం మంచిది కాదని మీరు నాకు చెప్పవద్దా? నన్ను ఇలా వంచన చేస్తారా?" అని ధుమ ధుమ లాడాడు.

సుమతి ఆవేశంతో, "నా చెల్లెలి శీలం మంచిది కాదని రుజువైతే నన్ను ఉరి తీయండి. ఈ మాట నిజం కాకపోతే





ఈ అపవాదు వేసిన వాణ్ణి పట్టుకుని ఉరి తీయండి!" అన్నాడు.

"ఇతని చెల్లెలి శీలం ఎలాటిదో నేను రుజువు చేస్తాను. నాకు నెల రోజులు గడు విప్వండి, మహారాజా," అన్నాడు నాగామాత్యుడు.

అతను రాజు అనుమతితో ఆ రోజే బయలుదేరి సాకేతపురానికి వెళ్ళి, సునీత ఉండే ఇంటికి చేరి, "నేను సునీతను చూడాలి. ఆమెకు ఆమె అన్న ఒక ఉత్తరం పంపాడు," అని లోపలికి కబురుచేశాడు.

"ఉత్తరం ముందు తీసుకురండి. నేనా మనిషిని చూసేదీ, లేనిదీ తరవాత ఆలోచిస్తాను," అన్నది సునీత ద్వారపాలకుడితో. నాగామాత్యుడు తాను సృష్టించిన ఉత్తరాన్ని లోపలికి పంపాడు. సునీత దాన్ని చూసి, "ఇది మా అన్న రాసిన ఉత్తరం కాదు. ఆ వచ్చినవాణ్ణి వెంటనే గెంటెయ్యండి," అన్నది.

నాగామాత్యుడి ఎత్తుపారలేదు. అయినా అతను ఇంతతో నిరుత్సాహపడక, సునీత దగ్గిర దాసీగా ఉండే మనిషి చేతిలో గుప్పెడు బంగారం పెట్టి, సునీత ఉంగరాన్ని తెప్పించి, దానితో శ్రీపురానికి తిరిగి వెళ్ళి, "మహారాజా, తమకు కోడలు కాబోయే మనిషి నాతో ఒక రాత్రి అంతా గడిపి, తన ప్రేమ చిహ్నంగా ఈ ఉంగరాన్ని నా కిచ్చింది," అని రాజుకు చెప్పాడు.

రాజు సుమతిని పిలిపించి, అతనికి నాగామాత్యుడు తెచ్చిన ఉంగరాన్ని చూపి, "ఇది నీ చెల్లెలి ఉంగరమేనా? ఒక రాత్రి ఆమెతో గడిపి మా మంత్రి ఈ ఉంగరాన్ని తెచ్చుకున్నాడు! ఏమంటావు?" అన్నాడు.

సుమతి కూడా తన చెల్లెలి శీలాన్ని శంకించక తప్పలేదు. "నన్ను ఉరితీయించండి! నా చెల్లెలి శీలాన్ని నమ్మలేకుండా నేను జీవించి మాత్రం ఏం ప్రయోజనం?" అన్నాడతను.

రాజు అతనికి ఉరి శిక్ష విధించాడు. శిక్ష అనుభవించటానికి ఒక వారం వ్యవధి ఇవ్వమని సుమతి కోరాడు. ఆ రోజే అతను తన చెల్లెలికి ఒక ఉత్తరం రాస్తూ, "నువు నీ శీలాన్ని కోల్పోయావు. నేను నా ప్రాణాలనే కోల్పోతున్నాను. నేను ఎందుకు చచ్చిపోతున్నదీ నీకు తెలియగలందులకు ఈ ఉత్తరం రాస్తున్నాను," అన్నాడు.

అన్న నుంచి ఉత్తరం రాకమునుపే సునీత చాలా ఆందోళనచెంది ఉన్నది. ఎందుకంటే, శ్రీపురం నుంచి ఎవడో వచ్చి మోసం ద్వారా తనను కలుసుకోవటానికి యత్నించాడు. వాడి పథకం పారలేదు వాడెందుకు వచ్చాడో తనకు తెలియదు. వాడు వచ్చినపని ఎలా పూర్తి అయిందో కూడా తెలియదు. ఆ తరవాత రెండు రోజుల లోపల తన ఉంగరం పోయింది. దాన్ని తన దాసీ తప్ప మరెవరూ తీయలేరు. ఆ ముండ తానేమీ ఎరగనని ఎన్ని ప్రమాణాలో చేసింది. ఇల్లంతా ఎన్నిసార్లు గాలించినా ఉంగరం కనిపించలేదు. అకస్మాత్తుగా తన శీలాన్ని శంకిస్తూ అన్న ఉత్తరం రాశాడు. తాను పోగొట్టుకున్న ఉంగరమే తనపై అభాండం పడటానికి కారణమై ఉంటుందనీ, కారకుడు ఆ నాడు



తన అన్న ఉత్తరమని దొంగ ఉత్తరం తెచ్చిన వాడే అయి ఉంటాడనీ ఆమె శంకించింది.

తన మీద అపవాదు మాట ఎట్లా ఉన్నా, అన్నకు ప్రాణం మీదికి వచ్చింది. అందు చేత ఆమె వెంటనే ఇంటికి తాళంపెట్టి శ్రీపురానికి బయలుదేరింది. శ్రీపురం చేరిన మరుక్షణమే ఆమెకు కథంతా తెలిసింది. రాజుగారి మంత్రి తాను కులట అని రుజువు చేశాడు! రాజుగారు తన అన్నను ఆ రోజే ఉరితీస్తున్నాడు!

సునీత తిన్నగా వధ్యస్థానానికి వెళ్ళింది. అక్కడ వేలాదిమంది చేరారు. సుమతిని

ఉరికంబం ఎక్కించి, రాజుగారి కోసం చూస్తున్నారు. త్వరలోనే రాజూ, మంత్రీ వచ్చారు. సునీత రాజుకు ఎదురు వెళ్ళి, "మహారాజా, ఒక్క మనవి! మీరు ఈ మీ మంత్రి మాట ఆధారంగా ఒక నిండు ప్రాణాన్ని తీయబోతున్నారు. కాని ఈమనిషి చవుకపారు దొంగ. ఈమధ్య మా సాకేత పురానికి వచ్చి నా యింట నగలు దొంగిలించాడు," అన్నది.

నాగామాత్యుడు సాకేతపురం వెళ్ళిన మాట నిజమే గనక రాజు అతని కేసి అనుమానంగా చూసి, "ఏమిటిది? ఈమె నగలు దొంగిలించావా?" అని నాగులును అడిగాడు.

"అబద్ధం, మహారాజా! నే నెన్నడూ ఈమె ముఖం కూడా ఎరగను," అన్నాడు నాగులు కోపంగా.

"నా ముఖమే ఎరగవా? నాతో ఒక రాత్రి గడిపావనీ, నా ప్రేమచిహ్నంగా నా ఉంగరం పుచ్చుకున్నావనీ ఈ నగరంలో అంతా చెప్పుకుంటున్నారే! అదీ అబద్ధమే?" అన్నది సునీత నాగులుతో.

రాజు ఆమె మాటలకు నిర్ఘాంతపోయి, "అమ్మా, నువ్వెవరు?" అని అడిగాడు.

"మహారాజా, నేనే అపవాదుపడిన సునీతను. అన్యాయంగా ఉరి శిక్ష అనుభవించనున్న సుమతి చెల్లెలిని," అంటూ జరిగినదంతా రాజుకు చెప్పి, కుళ్ళికుళ్ళి ఏడవసాగింది.

నాగులుకు ముఖం పాలిపోయింది, కాళ్ళు వణికాయి. రాజు అతని వాలకం చూస్తూనే సునీత నిర్దోషి అని గ్రహించగలిగాడు. ఆయన సుమతిని ఉరి కంబం నుంచి దింపించి, అతనికీ, సునీతకూ క్షమాపణలు చెప్పుకుని, ఆ ఉరికంబం మీదనే నాగులును ఉరితీయించాడు.

తరవాత సునీతకూ ప్రతాపుడికీ వైభవంగా పెళ్ళి జరిగింది.






# అన్నదమ్ముల యుక్తి

ఒకప్పుడు ఒక రాజ్యంలో భయంకరమైన కరువు వచ్చింది. తిండి కోసం ప్రజలు తలలు పగల గొట్టుకుంటున్నారు. అటు వంటి సమయంలో రాజుగారి ఒంటె ఒకటి తప్పిపోయింది. దాన్ని వెతకమని రాజు గారు తన భటులను ఊరి మీదికి పంపాడు.

రాజుగారుండే ఊళ్లోనే ఒక వెర్రి బాగుల దానికి ముగ్గురు కొడుకులుండేవారు. ఒకడు వ్యవసాయం చేసేవాడు, రెండోవాడు తోటలు పెంచేవాడు, మూడోవాడు బట్టలు నేసే వాడు. రాజుగారి ఒంటె తమ ఇంటి వైపుగా వచ్చినప్పుడు ఈ అన్నదమ్ములే దాన్ని పట్టుకుని, ఇంట్లోకి తీసుకు పోయి చంపి, దాని మాంసం జాడీలలో పెట్టి, బ్రహ్మ రుద్రులకు కనపడకుండా దాచేశారు.

ఇదంతా వాళ్ళ తల్లి చూసింది. ఆమె వెర్రిబాగులది కావటం చేత ఆమె దగ్గిర నిజం దాగదు. అందుచేత కొడుకులు ఆమెతో, "నిన్ను ఇవాళ పెళ్లికూతుర్ని చేస్తున్నాం. నీ పెళ్లికి ఈ ఒంటె మాంసంతో విందు చేస్తాం," అన్నారు.

తరవాత రాజభటులు పొలం దున్ను కుంటున్న వాడి దగ్గిరికి వచ్చి, "ఏయ్, కాపువాడా! ఇటుగా ఒంటె ఏదైనా వచ్చిందా?" అని అడిగారు.

"కనబడటం లేదా? పొలం దున్ను కుంటున్నాను," అన్నాడు వాడు.

"అది సరేలే. రాజుగారి ఒంటె తప్పించు కున్నది. నువు గాని దాన్ని చూశావా?" అన్నారు భటులు.

"చెప్పలేం. ఒక్కొ రోజు రెండెకరాలు దున్నేస్తాను. ఒక్కొ రోజు ఎకరం కూడా దున్నలేను," అన్నాడు వాడు.

ఇలా రెండు మూడు ప్రశ్నలు వేసి రాజ భటులు, "వీడు వెర్రి వెధవలాగున్నాడు," అనుకుని వెళ్లిపోయారు.

ఎస్. లక్ష్మీప్రభ

వాళ్ళు తరవాత రెండోవాడి తోటకు వెళ్ళారు. వాడు మామిడిచెట్ల నుంచి కాయలు దించుతున్నాడు.

"నువు రాజుగారి ఒంటెను చూశావా?" అని భటులు అడిగారు.

"చూస్తున్నాడు గదా, మామిడికాయలు దించుతున్నాను," అన్నాడు వాడు.

"మామిడికాయల మాట సరేలే, ఒంటె కనిపించిందా?" అని భటులు మళ్ళీ అడిగారు.

"ఈ చెట్లనేం చూశారు? అటు పక్క చెట్ల నుంచి ఇంతేసి కాయలు దిగుతాయి," అన్నాడు వాడు. వాడూ వెర్రివెధవేనని భటులు అనుకుని, బట్టలు నేసేవాడి దగ్గిరికి వెళ్లి, "రాజుగారి ఒంటెను చూశావా?" అని అడిగారు. వాడు కూడా వెర్రివాడిలాగే నటించుతూ, "ఒక్కో రోజు నేత బాగా సాగుతుంది. ఒక్కో రోజు అడుగడుగునా పోగు తెగుతుంది," అన్నాడు.

"అదంతా సరేలే. తప్పిపోయిన ఒంటెను నువు చూశావా, లేదా?" అని భటులు అడిగారు.

"పెళ్ళిళ్ళ తరుణమైతే నాలుగు డబ్బులు గిట్టుతాయి. లేకపోతే వర్తకులు ధర తొక్కి పడతారు," అన్నాడు వాడు.

వాడితో విసుగెత్తి భటులు వాళ్ళ తల్లిని అడగబోయారు. ఆ వెర్రి బాగులది వీధి గుమ్మం దగ్గిరే నిలబడి ఉన్నది.

"ఏమమ్మా, ఒంటెను ఏమైనా చూశావా?" అని భటులు ఆమె నడిగారు.

"చూడకేం, నాయనా? నా కొడుకులు దాన్ని చంపారు," అన్నదామె.

"ఎప్పుడు జరిగిందిది?" అని భటులు ఆత్రంగా అడిగారు.

"నన్ను పెళ్లికూతుర్ని చేశారే, ఆ రోజున!" అన్నది వెర్రి బాగులది.

ఆ మనిషిని మరి ప్రశ్నించి లాభం లేదనుకుని భటులు వెళ్లిపోయారు.





# దయ్యాలభూమి

పూర్వం కోసల సరిహద్దున రంగపురి అనే కుగ్రామం ఉండేది. అది పేదగ్రామంగా ఉండటానికి ముఖ్యకారణం ఆ గ్రామానికి మూడుపక్కల ఊబనేల. గ్రామానికి ఉత్తరాన ఉన్న భూమి చాలా మంచిది. చాలా కాలం గ్రామస్థులు ఆ భూమిలో పంటలు పండించారు. కాని పది, పన్నెండేళ్ళ నుంచీ అది బీడు వేసి పోయింది. అక్కడ దయ్యాలు చేరాయని గ్రామస్థుల నమ్మకం. అక్కడ వ్యవసాయం చెయ్యాలని ప్రయత్నించిన వారంతా దయ్యాల మూలంగా కీడు పొందారు. కొందరు బలవన్మరణం చెందారు. ఒకరిద్దరికి పిచ్చిపట్టింది. అటు తరవాత ఉత్తరపు భూమి పైన గ్రామస్థులు ఆశవదులుకున్నారు. అక్కడంతా ముళ్ళ పొదలూ, తుప్పలూ మొలిచాయి. అసలే పేదగ్రామంగా ఉన్న రంగపురి ఇప్పుడు మరింత హీనస్థితికి వచ్చింది.

ఈ గ్రామం నుంచి సుబుద్ధి అనే యువకుడు విద్యానిమిత్తం బాల్యంలోనే కాశీకి వెళ్ళి, అక్కడ అనేక శాస్త్రాలు చదివి, ఎంతో లోకజ్ఞానం గడించి స్వస్థలానికి తిరిగి వచ్చాడు. అతను తిరిగి వచ్చేనాటికి గ్రామం చాలా హీనస్థితిలో ఉన్నది. అతను గ్రామస్థుల నందరినీ పిలిచి, "మీరంతా ఉత్తరపు భూమిని ఎందుకు బీడు పెట్టారు? తిండిగింజలు కూడా లేకుండా ఎలా బతుకుతున్నారు?" అని అడిగాడు.

"మేం బతకటం లేదు. క్రమంగా చస్తున్నాం. ఊరు విడిచి పోయేవాళ్ళు ఏనాడో పోయారు. ఉత్తరపు భూమి ఇప్పుడు సాగుభూమి కాదు, దయ్యాల భూమి. ఒక్కొక్క రాత్రి అక్కడ కొరివిదయ్యాలు తిరుగుతాయి. ప్రతి రాత్రీ దయ్యాలు మేనాలు మొయ్యటం వినిపిస్తుంది. మర్రి చెట్టు నిండా దయ్యాలు కనిపిస్తాయి.

జి. సాంబిరెడ్డి



ఇదంతా పుకారు కాదు; ఊళ్ళో ప్రతీవాడూ కళ్ళారా చూసినదీ, చెవులారా విన్నదీనూ!'' అన్నారు గ్రామస్థులు.

వాళ్ళ అజ్ఞానాన్నీ, అమాయకత్వాన్నీ చూసి సుబుద్ధి నివ్వెరపోయాడు. అతను ఊళ్ళో ఎందరినో అడిగి చూశాడు. కొరివి దయ్యాలను దాదాపు ప్రతివాడూ చూశాడు. మేనాల మోతల చప్పుడూ, వెర్రి నవ్వులూ విననివాళ్ళు ఒక్కరూ లేరు. ఇద్దరుముగ్గురు రయితులు దయ్యాల భూమిలో దారుణంగా చచ్చిన మాట కూడా నిజమే.

సుబుద్ధి రాత్రివేళ బయటికి వచ్చాతు. వీధి నిర్జనంగా ఉన్నది. అతను ఉత్తరంగా నడిచి వెళ్ళాడు. ఊరి చివర చేరేసరికి దయ్యాల భూమిలో ఉన్న మర్రిచెట్టు కన బడింది. దాని పై భాగాన తెల్లగా ఏదో ఆడి నట్టు అనిపించింది. దానికి ఒక పక్కన గుప్పున పెద్ద మంట లేచి ఆరిపోయింది. ఎవరో వికారంగా నవ్వారు. తరవాత అంతా నిశ్శబ్దం.

సుబుద్ధి కోపంతో పళ్ళు కొరికి, తాను చెయ్యవలసిన దేమిటో ఆ క్షణానే నిర్ణ యించుకుని, ఇంటికి తిరిగి వచ్చేసి పడుకున్నాడు.

మర్నాడు అతను మధ్యాహ్న భోజనం చేసుకుని, తనకు కావలసిన వస్తువులన్నీ మూటగట్టుకుని, తాను మరొక చోటికి వెళ్ళి పోవాలని నిశ్చయించుకున్నట్టు గ్రామంలో అందరికీ చెప్పివచ్చాడు.

"వెళ్ళే వాడివి పొద్దుండగానే బయులు దేరు," అని ఊళ్ళోవాళ్ళు సలహా ఇచ్చారు.

ఇంకో గంటకు సూర్యాస్తమయం అవు తుందనగా సుబుద్ధి దయ్యాల భూమి కేసి బయులుదేరాడు. కాని అతను ఆ భూమి దాటి పోలేదు. తన మూటను ఒక పొదలో దాచి, మర్రిచెట్టు చుట్టూ ఉండే ప్రదేశ మంతా చాలా శ్రద్ధగా పరిశీలించాడు. అతని అనుమానం రూఢి అయింది. ఆ ప్రాంతాన



మనుషులు మసలిన జాడ లున్నాయి. ఆ మనుషులు గ్రామస్థులు మాత్రంకారు.

సూర్యాస్తమయం వేళకు సుబుద్ధి తన మూట విప్పి, అందులో నుంచి నల్లగుడ్డలు తీసి వేసుకుని, మూట పట్టుకుని మర్రిచెట్టు ఎక్కి విశాలంగా ఉన్న పై పంగలో సుఖంగా కూర్చుని, నిద్రలో పక్కకు ఒరిగి పడకుండా కొమ్మలకు తాళ్ళు అడ్డం కట్టు కున్నాడు. బాగా చీకటి పడినాక అతను తాను తెచ్చుకున్న ఆహారం తిని, నీళ్ళు తాగి, "దయ్యాల" కోసం ఎదురు చూస్తూ కూర్చున్నాడు.

రాత్రి ఝాముస్నర గడిచినాక కొందరు మనుషులు దయ్యాల భూమిలోకి వచ్చారు. వాళ్ళ కా ప్రదేశం బాగా తెలిసినట్టే కన బడింది. వాళ్ళు నలుగురైదుగురు మించి ఉండరు. వాళ్ళు ఒక చోట మంట చేశారు. ఆ మంటలో ఇంత గుగ్గిలం వేశారు. అది భగ్గునమండి ఆరిపోయింది. తరవాత వాళ్లు ఆ మంట మీద వంట ప్రారంభించారు. మధ్యలో ఒకడు పెద్ద గడ ఒకటి ఎత్తి, దానికి తెల్ల బట్ట ఒకటి కట్టి, మర్రి చెట్టు పక్కగా ఆడించి దించాడు. మధ్య మధ్య ఒకడు నక్కలు అరిచినట్టు అరిచాడు. ఇంకొడు వికారంగా నవ్వాడు.



ఈ విధంగా వాళ్ళు అర్ధ రాత్రి దాటిన దాకా దయ్యాలాటలు ఆడారు. మూడో ఝాములో మరి పదిమంది వచ్చి చేరారు. వాళ్ళు ఏవేవో మూటలు తెచ్చినట్టు సుబుద్ధికి తోచింది. వాళ్ళు పొయ్యిలో నుంచి కొరివి ఒకటి తీసుకుని తిన్నగా మర్రి చెట్టు కిందికి వచ్చి, అక్కడ ఉన్న ఒక పెద్ద బండరాయి పక్కకు తొలిగించి, గొయ్యి తీశారు. కొంత మట్టి తీశాక అడుగున ఇంకా చాలా మూటలున్నట్టు సుబుద్ధి గమనిం చాడు. వాళ్ళు తాము తెచ్చిన మూటలను వాటితో చేర్చి, వాటిపైన మళ్ళీ మట్టి కప్పి, బండరాయిని యథాస్థానంలో పెట్టారు.



మళ్ళీ కాస్సేపు దయ్యాలాట ఆడి, అందరూ సరిహద్దు కేసి వెళ్ళిపోయారు.

వాళ్ళు వెళ్ళిపోయాక సుబుద్ధి నిద్ర పోయాడు. అతనికి మెలకువ వచ్చేసరికి బారెడు పొద్దెక్కింది. అతను చెట్టు దిగి గ్రామంలోకి తిరిగి వచ్చాడు.

"వెళ్ళి పోతానని బయలుదేరితివే? అప్పుడే ఎలా తిరిగి వచ్చావు? ఎక్కడికి వెళ్ళావు?" అని గ్రామంలో వాళ్ళు అతన్ని అడిగారు.

"నే నెక్కడికి వెళ్ళాను? రాత్రంతా దయ్యాలభూమిలో ఉన్నాను. దయ్యాలతో కాలక్షేపం చేశాను," అన్నాడు సుబుద్ధి.

"దయ్యాలు నిన్ను ప్రాణాలతో వదిలాయా?" అన్నారు గ్రామస్థులు.

"అవీ మనవంటి దయ్యాలే. మన మంతా తలుచుకుంటే మన వల్ల వాటికే ప్రమాదం. మీకు ఒక చిత్రం చూపిస్తాను, నా వెంట రండి," అన్నాడు సుబుద్ధి.

అతను రమ్మంటున్నది దయ్యాలభూమి కని తెలిసి చాలామంది భయపడ్డారు. ధైర్యంగల యువకులను అయిదారు గురిని మాత్రం వెంట బెట్టుకుని అతను వారితో దయ్యాలభూమి అంతా మిట్ట మధ్యాసం వేళ తిరిగాడు.

"ఇదుగో దయ్యాలు వంట చేసుకునే పొయి రాళ్ళు. ఇదుగో కాలిన కట్టెల బూడిద. ఇదుగో గుగ్గిలం పొడి. మంటల్లో విసిరినప్పుడు చెదిరి పక్కన పడింది. పొయి మంటలో గుగ్గిలం వేస్తే అదే కొరివిదయ్యం! తెలిసిందా? దయ్యాలు వంట చేసుకు తింటాయా? మీరు దయ్యాలనుకునేవాళ్ళు దొంగలు. అంతా కలిసి పదిహేనుమంది దాకా ఉన్నారు. మర్రిచెట్టు మీద దయ్యాలు ఆడటం ఏమిటో తెలుసా? పెద్ద కర్రకు బట్ట ఒకటి కట్టి ఆడించారు. ఈ మర్రి చెట్టు మీద ఉండి రాత్రి వాళ్ళ ఆటలన్నీ చూశాను. వాళ్ళు సరిహద్దు అవతల అడ

పుల్లో వుంటారని నా అనుమానం. రాత్రి పూట దొంగతనాలు చేసి తెచ్చి, దాన్ని ఈ మర్రిచెట్టు దగ్గిరే, ఈ రాయి కిందే పాతేస్తున్నారు. పట్టండి, రాయి పక్కకు ఎత్తండి," అన్నాడు సుబుద్ధి.

అందరూ కలిసి ఎత్తిన మీదట రాయి లేచింది. దాని కింద తవ్వేసరికి చిన్న, పెద్ద మూటలు దాదాపు నూరుదాకా దొరికాయి. సుబుద్ధి వాటిని గ్రామంలోకి మోయించుకు పోయాడు. గ్రామస్థు లంతా చేరారు. సుబుద్ధి చెప్పినదంతా విన్నారు. అతని మాటలలో వారికి గురికుదిరింది.

"పన్నెండేళ్ళుగా మన గ్రామాన్ని పాడు పెట్టిన ఈ దొంగలను మనం కఠినంగా శిక్షించాలి. వీళ్ళను పట్టుకుని పొరుగు రాజుకు అప్పగించుదాం. ఈ దొరికిన దొంగ సొమ్ము కూడా రాజుకే ఇచ్చేసి, వారేం బహుమానం ఇస్తే అది పుచ్చుకుందాం. అటు తరవాత మన ఉత్తరపు భూమిని మనం ఉమ్మడిగా వ్యవసాయం చేసుకుందాం," అన్నాడు సుబుద్ధి.

ఆ రాత్రి మూడో ఝామున దొంగలు మర్రిచెట్టు కింద రాయి ఎత్తి, మట్టి తవ్వి తమ సంచులు లేకపోయినందుకు నిర్ఘాంత పోయి ఉండగా, యాభైమంది గ్రామస్థులు కర్రలతో వాళ్ళ పైనపడి, చావబాది, పొరుగు రాజ్యానికి తీసుకుపోయారు.

పొరుగురాజు దొంగలు దొరికినందుకు చాలా ఆనందించాడు. సరిగా పన్నెండేళ్ళ నుంచీ దొంగతనాలు జరుగుతున్నాయి. దొంగలనూ, దొంగసొత్తునూ పట్టుకోవడంలో ప్రధానపాత్ర వహించిన సుబుద్ధికి రాజు గొప్ప బహుమానం ఇచ్చాడు. గ్రామానికి అయిదుబళ్ళ ధాన్యం బహుమానంగా లభించింది. ఆ యేడే రంగపురి రైతులు ఉత్తరపు భూమిని బాగుచేసి, దున్ని, పంటలు వేశారు. అటుతరవాత రంగపురి దారిద్ర్యం క్రమంగా తీరిపోయింది.





# ముష్టివాడి కర్ర

ఒక గ్రామంలో ఒక బిచ్చగాడుండేవాడు. వాడి కొక చేతికర్ర ఉండేది. దానికి రెండు చివరలా ఇత్తడి పొన్నులుండేవి. ఆ కర్ర అస్తమానమూ వాడి చేతిని విడిచి పెట్టేది కాదు. మేలుకుని ఉన్నప్పుడే గాక, నిద్ర పోయేటప్పుడు కూడా వాడు ఆ కర్రను తన తలికింద అడ్డంగా పెట్టుకుని మరీ నిద్ర పోయేవాడు.

బిచ్చగాడు తన కర్రను క్షణం పాటైనా పక్కన పెట్టడన్న సంగతి వీరయ్య అనే వాడు పసిగట్టాడు. బిచ్చగాణ్ణి చూస్తే కర్ర లేకుండా నడవలేనంత ముసలివాడు కాడు. గుడ్డివాడు కాడు. ఆ కర్రలో వాడి ఆస్తి ఏదో దాచి ఉండాలని వీరయ్యకు తోచింది. ఎలాగైనా ఆ కర్రను తస్కరించాలని అతనికి పుట్టింది. ఒక రాత్రి బిచ్చగాడు పడుకున్న చోటనే తాను కూడా పడుకుని, బిచ్చగాడు గాఢనిద్రలో పక్కకు ఒత్తిగిలిన సమయంలో వీరయ్య ఆ కర్రను సంగ్రహించి, తెల్లవారే సరికి ఊరి బయటికి చేరుకున్నాడు.

అదే సమయంలో ఆ వూరి సెట్టి తన అంగడికి సరుకులు కొనటానికి పక్క ఊరి సంతకు వెళుతూ కనిపించాడు. సెట్టి మొలలో ఉన్న డబ్బు మూట చూడగానే వీరయ్యకు దోచుకోవాలనిపించింది.

అతను సెట్టి దారికి అడ్డంగా నిలబడి, "నీ దగ్గిర ఉండే సొమ్మంతా అక్కడ పెట్టు!" అని గద్దించాడు.

సెట్టి మొరాయించాడు.

"సొమ్మిస్తావా, లేదా?" అంటూ వీరయ్య సెట్టి నెత్తి మీద కర్రతో బలంగా కొట్టాడు. ఆ దెబ్బతో సెట్టి కళ్ళు తేలవేసి, విరుచుకు పడిపోయాడు.

సెట్టి బొడ్డులో ఉండే మూట లాక్కున్న వీరయ్యకు సెట్టి చచ్చాడని భయం పుట్టింది.

పఠాన్ ఖాదర్ వలీఖాన్

ఎవరన్నా చూస్తారని అతను ఆ కర్రను అక్కడే వదిలేసి పారిపోయాడు.

కొద్ది సేపటికి సెట్టికి స్పృహ వచ్చింది. తన నెత్తిన కర్రతో కొట్టిన దుర్మార్గుడు తన బొడ్డు నున్న పదిరూపాయులూ కాజేశాడు. కాని వాడు తన కర్రను వదిలేసి పోయాడు. సెట్టి ఆ కర్రను తీసి పరీక్షించాడు. కర్ర బాగా బరువున్నది. ఏ మాయు మాట లన్నా చెప్పి ఆ కర్రను ఇరవై రూపాయలకు అమ్మి, పోయిన పదితోబాటు మరో పది సంపాదించాలని సెట్టికి పుట్టింది.

అతను పారుగూరి కమసాలి వద్దకు వెళ్లి, "ఈ కర్రలో ఖరీదైన రత్నాలున్నాయి. శాస్త్రప్రకారం వాటిని నేను అనుభవించ రాదుట. చవగ్గా ఇస్తాను, ఈ కర్ర తీసుకుని, పొన్నులు ఊడగొట్టి, ఆ రాళ్ళను నువే ఉపయోగించుకో," అన్నాడు.

సెట్టి మాటలు నమ్మి కమసాలి అ కర్రను ఇరవైరూపాయులకు కొన్నాడు.

కమసాలి దుకాణంలో సెట్టికీ, కమసాలికీ జరిగిన సంభాషణ అంతా వీధిలో ఉన్న దొంగ వెధవ లిద్దరు విని, ఆ రాత్రి కమసాలి ఇంట ప్రవేశించి, ఆ కర్రను దొంగిలించారు.

వాళ్ళు దాన్ని ఊరి బయటికి తీసుకుపోయి దాని ఇత్తడి పొన్నులు ఊడ గొట్ట



టానికీ, లోపల ఉన్న రత్నాలు పంచుకోవ టానికీ నిశ్చయించారు. కాని ఆ పొన్నులు ఊడి వచ్చే మార్గం కనిపించలేదు. ఇంత లోపునే వాళ్ళకు పంపకం విషయంలో అభిప్రాయ భేదాలు వచ్చాయి. ఎవరి మటుకు వారు తన కెక్కువ వాటా రావా లన్నారు. అది కొట్లాటగా పరిణమించింది.

అంతలో రాజభటులు వాళ్ళను పట్టు కుని, రాజుగారి వద్దకు తీసుకుపోయారు. వాళ్ళు కర్రలో ఉన్న ధనం కోసం పోట్లాడు కుంటున్నారనీ, వాళ్ళు ఆ కర్రను ఎక్కడో దొంగిలించారనీ రాజు తెలుసుకుని, ఇద్దరినీ నిర్బంధంలో పెట్టించాడు.

తరవాత రాజు ఒక ప్రకటన చేస్తూ, తన వద్దకు వచ్చిన కర్రలో ఏమున్నదీ చెప్పిన వారికి ఆ కర్రనూ, మంచి బహు మానాన్నీ ఇస్తానని తెలియబరిచాడు.

ఈ ప్రకటన విని వీరయ్యా, సెట్టీ, కమ సాలీ, కర్రను పోగొట్టుకున్న బిచ్చగాడూ వచ్చారు. "ఆ కర్రలో బంగారం ఉన్నది," అన్నాడు వీరయ్య.

"రత్నాలున్నాయి," అన్నాడు సెట్టి.

"అవును, రత్నాలే ఉన్నాయి," అన్నాడు కమసాలి.

"ఆ కర్ర నాదే, బాబూ. నా కిప్పించండి," అన్నాడు బిచ్చగాడు.

"అందులో ఏమున్నది?" అని రాజు బిచ్చగాణ్ణి అడిగాడు.

"ముష్టివాడి చేతికర్రలో ఏముంటుంది, బాబూ? అందులో ఏమీ లేదు. కాస్త గట్టి కర్ర. ఎవరో పుణ్యాత్ముడు రెండు చివరలా ఇత్తడి పొన్నులు వేసి ఇచ్చాడు," అన్నాడు బిచ్చగాడు.

చెపుతామంటూ వచ్చి, కర్రలో ఏము న్నదీ చెప్పలేక పోయిన వీరయ్య చేతా, సెట్టి చేతా, కమసాలి చేతా నూరేసిరూపా యలు బిచ్చగాడికి ఇప్పించి, వాడి కర్ర వాడి కిచ్చి పంపేశాడు రాజు.






# రాజదండం

విక్రమసిద్ధి కళింగ సింహాసనం ఎక్కిన కొద్ది కాలంలోనే అతను, తన రాజ్యానికి చుట్టూ ఉన్న శత్రురాజుల నందరినీ క్రమంగా జయించి, తన రాజ్యాన్ని బలిష్ఠంగా తయారు చేసుకున్నాడు. కాని భువనగిరి రాజైన జయదేవుడు, కళింగ రాజుకు సామంతు అయి ఉండి కూడా, తిరుగుబాటు చేశాడు. అతన్ని జయించి రమ్మని విక్రమసిద్ధి తన సేనాను లందరిలోనూ చిన్నవాడూ, విశ్వాసపాత్రుడూ, తెలివిగలవాడూ అయిన శక్తిసింహుణ్ణి నియోగించాడు. శక్తిసింహుడు బయలుదేరేటప్పుడు రాజు అతనికి తన రాజదండాన్ని ఇచ్చి, "ఇది నీ వద్ద ఉన్నంత కాలమూ నీ నిర్ణయాలన్నీ నావే! వెళ్లి, విజయుడవై తిరిగిరా!" అని ఆశీర్వదించాడు.

శక్తిసింహుడు బలమైన సేనను వెంటబెట్టుకుని భువనగిరి రాజ్యాన్ని చేరుకుని, దుర్గానికి ఒక మైలు దూరంలో శిబిరం ఏర్పాటు చేసుకున్నాడు. అతను అంతకు పూర్వం ఈ దుర్గాన్ని చూడలేదు. దాన్ని ముట్టడించి జయించటం మాటలు కాదు. ఆ దుర్గం రెండేళ్ళ ముట్టడికి సైతం తట్టుకోగలదు.

యుద్ధప్రయత్నాలు నిరుపయోగమని తెలిసిన మరుక్షణమే శక్తిసింహుడు జయదేవుడి వద్దకు సంధిరాయబారం పంపాడు. సంధిసంభాషణలు జరపటానికిగాను అతను తన శిబిరానికీ, దుర్గానికీ మధ్య దారిలో ఒక గుడారం వేయించాడు. ఆ గుడారం లోపల రెండు వందల పెట్టెలు ఏర్పాటు చేయించాడు. అతను కొద్దిమంది అంగరక్షకులతో ఆ గుడారానికి వచ్చి, జయదేవుడి రాకకోసం ఎదురు చూడసాగాడు.

జయదేవుడు కూడా కొద్దిమంది అంగరక్షకులతో గుడారానికి వచ్చాడు.

ఆర్. వివేకానందశర్మ

"నేను నిరాయుధుణ్ణి. నువూ నిరాయుధుడివే. మనం జరిపే సంధి సంభాషణలు పై వాళ్ళు వినదగినవి కావు. అందు చేత నీ అంగరక్షకులనూ, నా అంగరక్షకులనూ పంపేసి, మనం స్వేచ్ఛగా మాట్లాడుకుందాం," అన్నాడు శక్తిసింహుడు.

ఇద్దరూ గుడారంలో మిగిలిపోయారు. అప్పుడు శక్తిసింహుడు జయదేవుడితో, "అన్నా, రాజు నాకు అసాధ్యమైన పని పెట్టాడు. ఎంత సేన ఉంటే మాత్రం నేను నీ దుర్గాన్ని గెలుస్తానన్నది కలలో మాట. నేను ఓడిపోయి తిరిగి పోవటం కన్న యుద్ధంలో చావటం మేలు. రాజు మహా క్రూరుడు. అలాటి కంటకుడి పైన తిరుగుబాటు చేసిన నిన్ను చూసి నాకు ఈర్ష్యగా ఉన్నది. నేను కూడా నీతో బాటు తిరుగుబాటులో చేరిపోతాను," అన్నాడు.

"అంతకన్నానా? నువు పేరు మోసిన యోధుడివి. ఇద్దరమూ కలిసి కళింగ రాజ్యాన్ని కొంచెం కొంచెమే కబళించెయ్యవచ్చు. మన సామ్రాజ్యంలో నా తరవాత నువు నా అంత వాడివిగా ఉండవచ్చు. కాని నువు నన్ను మోసం చెయ్యవని నాకు రూఢి ఏమిటి?" అన్నాడు జయదేవుడు.

"నేను ప్రమాణాలు చెయ్యను. ఇలాటి సందర్భాలలో వాటికి విలువ ఏమీ ఉండదు.



అంతకన్న విలువ గలదే నేను నీ పరం చేస్తాను," అన్నాడు శక్తిసింహుడు.

"నువ్వు నా అధీనంలో ఉండిపోయే ట్టుంటే నీ మాట నమ్ముతాను," అన్నాడు జయదేవుడు.

"అందుకు నాకైతే ఏమీ అభ్యంతరం లేదు గాని, సేనలు నన్ను తోసి పుచ్చి, మరొక నాయకుణ్ణి అంద పెట్టుకుని యుద్ధం సాగించవని ఏమిటి? అంతకన్న మంచి మార్గం చూపుతాను," అంటూ శక్తిసింహుడు తన మనిషిని ఒకణ్ణి కేక పెట్టాడు. ఆ మనిషికి ఒక పెట్టె చూపి, తాళం పగలగొట్టమన్నాడు. ఆ పెట్టెనిండా బంగారం ఉన్నది.

"యుద్ధపు ఖర్చులకని రాజు నాకు ఇలాటి పెట్టెలు రెండువందలు ఇచ్చాడు. ఇవే ఆ పెట్టెలు. ఈ పగలగొట్టిన పెట్టెను నేను ఉంచుకుని మిగిలినవన్నీ నీ కిచ్చేస్తాను. మనం ముందు ముందు నిర్మించబోయే సామ్రాజ్యానికి మిత్రులను బహూకరించటానికీ, శత్రువులకు లంచాలు పెట్టటానికీ, ఇతర ఖర్చులకూ ఈ బంగారం ఎంతగానో పనికి వస్తుంది. ఇది నీకు ఇచ్చెయ్యటం వల్ల మరొక లాభ మేమంటే, డబ్బు లేక నా సేన ఒక్క రోజు కూడా బతకలేదు. అది నీకు సులువుగా వశమవుతుంది. ఈ పెట్టెలు చేరవెయ్యటానికి 400 మంది



నిరాయుధ సైనికులను పంపుతాను. తరవాత నువు ఎప్పుడు పిలిస్తే అప్పుడు నేనూ నా సేనలూ వచ్చి చేరతాం," అన్నాడు శక్తి సింహుడు.

జయదేవుడు తృప్తి పడ్డాడు. పెట్టెకు ఇద్దరు చొప్పున కళింగ సైనికులు పెట్టెలను మోస్తూ దుర్గం కేసి బయలుదేరారు. జయదేవుడు తన మనుషులలో ఒకణ్ణి గుర్రం మీద పంపుతూ, "ద్వారరక్షకులతో వీళ్లను లోపలికి పోనివ్వమని చెప్పు," అన్నాడు.

వాళ్ళు వెళ్ళిపోయాక ఇద్దరూ కబుర్లాడే సమయంలో జయదేవుడు, "నీ వెంట రాజదండం తెచ్చావుట. ఇక అది నా దగ్గర ఉండటమే ఉచితం గదా?" అన్నాడు.

శక్తిసింహుడు లేచి వెళ్లి రాజదండాన్ని తీసుకువస్తూ, "ఇది అపూర్వమైన రాజదండం. దీన్ని చేత బట్టినవాడు అజేయుడు. ఇది రాజద్రోహుల పాలిటి వజ్రాయుధం," అంటూ అకస్మాత్తుగా జయదేవుడి తలపైన దానితో బలంగా కొట్టాడు. జయదేవుడు తల పగిలి ప్రాణాలు వదిలాడు.

ఈ లోపల పెట్టెలన్నీ భువనగిరి కోటలో ప్రవేశించాయి. ఒక్కొక్క పెట్టెలో నుంచీ ఒక్కొక్క యోధుడు లేచి వచ్చి, తనను మోసుకు వచ్చిన ఇద్దరేసి యోధులకూ ఆయుధా లిచ్చాడు. అరువందల మంది శత్రుయోధులు కోట ద్వారాన్ని అవలీలగా స్వాధీనపరుచుకున్నారు.

ఇంతలోనే శక్తిసింహుడు కళింగ సేనలను వెంట బెట్టుకుని వచ్చి కోటలో ప్రవేశించాడు. కోట అతని వశం కావటానికి ఎన్నో గంటలు పట్టలేదు.

శక్తిసింహుడు ఇంత త్వరగానూ, తేలికగానూ భువనగిరిని జయిస్తాడని విక్రమసిద్ధి కలలో కూడా అనుకోలేదు. ఆయన జయదేవుడి స్థానంలో శక్తిసింహుణ్ణి తన సామంతుడుగా నియమించి, అనేక బహుమతులూ బిరుదులూ ఇచ్చి గౌరవించాడు.






# మట్టికాళ్ళు

పిల్లలు ఎక్కడెక్కడో తిరిగి వచ్చారు. "కాళ్ళు కడుక్కొండిరా," అన్నాడు తాతయ్య.

మిగిలిన వాళ్ళంతా కాళ్ళు కడుక్కొని వచ్చారు, కాని చిన్నవాడు వెళ్ళలేదు.

"చిన్నవాడా, నీ కాళ్ళ నిండా మట్టి చూడు. వెళ్లి కాళ్లు కడుక్కురా," అన్నాడు తాతయ్య.

"వా డెప్పుడూ కాళ్ళు కడుక్కోడు, తాతయ్యా. కాళ్ళ మట్టి పక్కలకంతా పట్టిస్తాడు," అన్నారు మిగిలిన పిల్లలు.

"కడుక్కుంటే మళ్ళీ కాళ్ళకు మట్టి అపనే అవుతుంది, తాతయ్యా," అన్నాడు చిన్నవాడు.

"వెనకటికి నీలాటి వాడే ఉండేవాడు ఒక రాజు," అన్నాడు తాతయ్య.

పిల్లలు కథ కోసం తాతయ్య చుట్టూ మూగి, "ఎవరా రాజు, తాతయ్యా? ఆ రాజు ఏం చేశాడు, తాతయ్యా?" అని అడిగారు.

"వినండి చెబుతాను," అంటూ తాతయ్య చిటికెడు పొడుం పీల్చి ఇలా చెప్ప నారంభించాడు:

ఆ రాజు ఎవరైతే నేం? ఆయనకు మట్టి అంటే మహా మంట. కాళ్ళు కాస్త మట్టి అయితే సహించలేక పోయేవాడు. వెంటనే వెళ్లి కాళ్ళు కడుక్కునేవాడు. కాని ఏం లాభం? మళ్ళీ మట్టి కాళ్ళకు అంటనే అంటేది.

ఇది చూసి చిరాకెత్తి రాజు తన మంత్రిని పిలిచి, "నీకు నెలరోజులు గడువిచ్చాను. రాజ్యంలో ఎక్కడా మట్టి లేకుండా చెయ్యి. అలా చెయ్యక పొయ్యావో నీ తల తీసేస్తాను," అన్నాడు. మంత్రికి గుండెదడ పట్టుకున్నది. ఆయన ఆస్థానంలో ఉన్న పండితులనూ, జ్ఞానులనూ పిలిచి చిన్న చర్చ జరిపాడు.

అందరూ కలిసి రెండు రోజులు చర్చించి ఒక నిర్ణయానికి వచ్చారు. ఆ నిర్ణయం ఏమిటంటే: ఒక లక్ష మంది మనుషులకు ఒక లక్ష చీపుళ్ళు ఇచ్చి, దేశమంతటా ఊడ్పించటం.

ఇంకేముంది లక్షమంది ఊడవటం మొదలు పెట్టేసరికి దుమ్ము లేచి గాలి యావత్తూ కమ్మేసింది. ఎవరికీ ఊపిరాడ లేదు. రాజుగారు గాలితో బాటు ధూళి కూడా పీల్చి, తుమ్మసాగాడు.

అప్పుడు రాజుగారు మంత్రిని పిలిపించి, "మట్టి లేకుండా చెయ్యమంటే గాలి యావత్తూ దుమ్ముతో నింపుతున్నావా? ఈ వెధవ పని ఆపించక పోతే ఇప్పుడే నీ తల తీసేస్తాను," అన్నాడు.

మంత్రి మేధావులను పిలిచి మళ్ళీ సభ చేశాడు. వాళ్ళు తాము పొరపాటు చేశామని తెలుసుకున్నారు. "గాలికి దుమ్ము శత్రువు. కాని దుమ్ముకు నీరు శత్రువు. రాజ్యమంతా దుమ్ము పోయినదాకా కడిగింతాం," అనుకున్నారు వాళ్ళు.

సరే ఇంకేముందీ? పది లక్షల మందికి పది లక్షల బొక్కెనలిచ్చి, రాజ్యమంతా కడగమన్నారు. బావుల నుంచి నీరు తోడి నేలంతా కడగసాగారు. త్వరలోనే బావుల్లో నీరు అడుగంటింది. నేల కడిగిన మట్టి



నీరంతా చెరువుల్లోకీ, దొరువుల్లోకీ పోయింది. ఎక్కడా చుక్క మంచి నీరు లేదు.

మళ్ళీ మంత్రి చేసిన పనే ఇది కూడా అని తెలిసి రాజు పట్టరాని ఆగ్రహంతో, "నీ వంటి బుద్ధి తక్కువవాడు మంత్రి కావటం నా దౌర్భాగ్యం. మట్టి సమస్య తీర్చకపోగా కొత్త సమస్యలు ప్రాణం మీదికి తెస్తున్నావు. రేపీపాటికి మట్టి సమస్య సరిగా పరిష్కరించే మార్గం చెప్పక పోయావో నీ మెడ మీద తల ఉండదు," అని కేక వేశాడు.

మంత్రికి చావు భయం పట్టుకున్నది. ఆయన మేధావులను మళ్ళీ సమావేశ పరిచి చర్చించాడు. ఒక మేధావి చక్కని ఆలోచన చెప్పాడు.

"దేశంలో మట్టి ఉన్నంతమేరా, కనీసం మనుషులు నడిచేటంతమేరా, తోళ్ళు పరిచి నట్టయితే కాళ్ళకు మట్టి అంటదు. ఏమంటారు?" అన్నాడా మేధావి.

"అద్భుతం! ఈ ఆలోచన దివ్యంగా ఉంది," అన్నారు మిగిలిన మేధావులు.

మంత్రి వెళ్ళి, భయపడుతూ భయ పడుతూ ఈ ముక్క రాజుగారికి మనవి చేశాడు. "ఈసారి మంచి ఆలోచన చేశావు! ఇన్నాళ్ళూ ఈ బుద్ధి ఏమయింది? చర్మ కారులను పిలిపించు," అన్నాడు రాజు.



చర్మకారు లందరూ రావలిసిందని దండోరా వేశారు. కొన్ని వందల మంది చర్మకారులు రాజును చూడవచ్చారు.

"మనుషులు నడిచే మేర తోళ్ళు కప్పాలి. అందుకు ఎన్ని లక్షల చర్మాలు కావాలి? ఎంత కాలం పట్టుతుంది? ఎంత ఖర్చవుతుంది? ఈ లెక్కలన్నీ మీరు ఎన్ని రోజులలో ఇవ్వగలరు? తరవాత పని పూర్తి కావటానికి ఇంకెన్నాళ్ళు పడుతుంది?" అని రాజుగారు చర్మకారులను అడిగాడు.

ఒక ముసలి చర్మకారుడు, "మహరాజా, మనుషులు నడిచే దార్లన్నీ కొలిపించాలి. ఎన్ని చర్మాలు పరవాలో లెక్క కట్టాలి. అన్ని చర్మాలు పోగయేదాకా ఆగాలి. ఇది రోజుల్లోనూ, వారాల్లోనూ ముగిసే పని కాదు," అన్నాడు.

రాజు మంత్రి కేసి కోపంగా చూశాడు. తన మంత్రి ఏ ఆలోచన చేసినా ఇలాగే ఉంటుందెందుకో ఆయనకు అర్థం కాలేదు.

ఇంతలో ఒక యువకుడైన చర్మకారుడు, "నాదొక మనవి, మహారాజా! నడిచే దార్లన్నీ తోళ్ళతో కప్పే కన్న, నడిచే కాళ్ళకు తోళ్ళు తగిలించటం తేలిక అనుకుంటాను. వాటి నమూనా తయారు చేసి తమకు రేపే చూపగలను," అన్నాడు.

"ఏదీ? రేపు చూపు," అన్నాడు రాజు.

చర్మకారుడు మర్నాడు తోలుతో చెప్పులు కుట్టి తెచ్చి రాజుగారి ముందు పెట్టాడు. అవి కాళ్ళకు పట్టుకునేటట్టుగా పైన తోలు పట్టీలూ, కింద తోలు అట్టలూ పెట్టి కుట్టి ఉన్నాయి. రాజు వాటిని తొడుక్కుని కొంత దూరం నడిచి వచ్చి కాళ్ళ కేసి చూసుకున్నాడు. కాళ్ళకు మట్టి కాలేదు.

"భేష్! మా మంత్రి కన్న నువే నయం! రాజసభలో అందరికీ ఇటువంటి పాదరక్షలు తయారు చేసి పట్టుకురా," అన్నాడు రాజు.

అది మొదలు మనుషులు చెప్పులు అలవాటు చేసుకున్నారు.





# మహాభారతం

తన తండ్రి అయిన పరీక్షిత్తు ఎలా మరణించిందీ జనమేజయుడు ఇప్పుడే తెలుసుకున్నాడు. పసితనంలోనే అతన్ని మంత్రులు రాజుగా అభిషేకించి, యుక్త వయసు వచ్చాక అతనికి కాశీరాజు కూతురైన వపుష్టను తెచ్చి పెళ్ళి చేశారు.

"పరీక్షిత్తు మహారాజు పాము కరిచి మరణించాడు గనక, ఈ ఉదంకమహాముని హెచ్చరించినట్టుగా సర్పయాగం చెయ్యటం ఉచితంగానే ఉంటుంది," అని మంత్రులు జనమేజయుడితో అన్నారు.

జనమేజయుడు సర్పయాగం చెయ్యటానికీ, అందులో తక్షకుడు మొదలైన సర్పాలను యాగాగ్నికి ఆహుతి చేసి బూడిద చెయ్యటానికీ తీర్మానించుకుని, రాజపురోహితులనూ, ఋత్విక్కులనూ పిలిచి, సర్పయాగం చేసే విధానమేమిటని అడిగాడు. సర్పయాగమన్నది జనమేజయు డొక్కడి కోసమే ఏర్పడిందనీ, దాన్ని మరెవ్వరూ చెయ్యరనీ ఋత్విక్కులు చెప్పారు.

యాగసంభారాలన్నీ సేకరించబడ్డాయి. యజ్ఞశాలలు నిర్మించారు. ఒక వంక యాగానికి ఏర్పాట్లు జరుగుతూ ఉంటే, లోహితాక్షుడు అనే సూతుడు, భవిష్యత్తు తెలిసినవాడు కావటంచేత, "ఈ యాగం పూర్తి కాకుండా ఒక బ్రాహ్మణుడు అడ్డు పడతాడు," అని చెప్పాడు.

జనమేజయుడు అతని హెచ్చరికను పాటించక పోగా, యాగం జరిగేటంత కాలమూ లోహితాక్షుణ్ణి యజ్ఞశాలలోకి రానివ్వ

2. యయాతి కథ





సర్ప వినాశనం చూసి వాసుకి చాలా దిగులు పడ్డాడు. అతను తన చెల్లెలైన జరత్కారువు వద్దకు వెళ్ళి, "ఇలా జరగకుండా ఉండాలనే కదా నిన్ను జరత్కారుడనే మునికిచ్చి పెళ్ళి చేశాం! నీ కొడుకైన అస్తీకుణ్ణి పంపి ఈ యాగం ఆపు చేయించు," అన్నాడు.

తల్లి చెప్పిన మీదట అస్తీకుడు సర్ప యాగం జరిగే చోటికి వెళ్ళి, స్వస్తివాచకం చెప్పి, రాజునూ, ఋత్విక్కులనూ, అగ్నినీ స్తోత్రం చేశాడు. జనమేజయుడు అస్తీకుణ్ణి చూసి ముచ్చటపడి, "చూస్తే కుర్రవాడు, ఎంత జ్ఞానం కనబరిచాడు! ఇతను కోరిన వరం ఇవ్వదలిచాను," అని సదస్యులతో అన్నాడు.

వెంటనే అస్తీకుడు సర్పయాగం నిలపమని కోరాడు. జనమేజయుడు యాగం ఆపటం తప్ప ఇంకేమి కోరినా ఇస్తానన్నాడు. కాని అస్తీకుడు అందుకు ఒప్పలేదు. మిగిలిన వాళ్ళు కూడా జనమేజయుణ్ణి ఇచ్చిన మాట నిలబెట్టుకోమన్నారు. సర్పయాగం నిలిచిపోయింది.

అప్పుడు జనమేజయుడు అందరికీ దక్షిణ సత్కారాలు జరిపి, వేదవ్యాసుడు శిష్య సహితంగా రాగా, తన పూర్వీకులైన పాండ

వద్దని ఉత్తరువు చేసి, వపుష్టమహాదేవితో సహా తాను యజ్ఞదీక్ష తీసుకుని, యజ్ఞశాలా ప్రవేశం చేశాడు. సర్పయాగానికి చండభార్గవు డనేవాడు హోత, పింగళుడు అధ్వర్యుడు, కౌత్సుడు ఉద్గాత. యాగం ఆరంభమయింది. ఎక్కడెక్కడి సర్పాలూ అగ్నిగుండంలో పడిపోతున్నాయి. వాటి సంఖ్య వేలకూ, లక్షలకూ పాకింది.

తక్షకుడు బెదిరిపోయి ఇంద్రుణ్ణి శరణు జొచ్చాడు. "ఈ సర్పయాగంలో కొన్ని మేటి సర్పాలకు భయం ఉండదని బ్రహ్మ ముందే చెప్పాడు. భయపడకు. నా వద్దనే ఉండు," అన్నాడు ఇంద్రుడు.







వుల వృత్తాంతాలన్నింటినీ వైశంపాయనుడి నోట విన్నాడు.

భారతవంశానికి మూల పురుషుడు వైవస్వతమనువు. ఆయన అదితికి మనమడు. వైవస్వతుడి కూతురైన ఇళకు పురూరవుడు పుట్టాడు. పురూరవుడికీ, ఊర్వశికీ కలిగిన అరుగురు కొడుకులలో ఆయువు అనే వాడికి నహుషుడు మొదలుగా నలుగురు కొడుకులు పుట్టారు. నూరు యజ్ఞాలు చేసి ఇంద్రత్వం కూడా కొంత కాలం అనుభవించిన నహుషుడు అరుగురు కొడుకులను కన్నాడు. వారిలో యయాతి రెండవవాడు. పెద్దవాడైన యతి తపస్సుకు పోగా, యయాతి రాజ్యపాలన చేశాడు.

యయాతి రాజ్యపాలన చేసే కాలంలో శుక్రుడు దానవులకు పురోహితుడుగా ఉండే వాడు. దేవదానవ యుద్ధాలలో చనిపోయిన దానవులను ఆయన మృతసంజీవని అనే మంత్రంతో బతికించేవాడు. దేవతల గురువైన బృహస్పతికి ఆ విద్య రాదు. అందుచేత దేవతలు బృహస్పతి కొడుకైన కచుడనే వాణ్ణి, మృతసంజీవనీ మంత్రం నేర్చుకు రమ్మని శుక్రుడి వద్దకు పంపారు.

కచుడు వచ్చి శుక్రుడికి శుశ్రూష చేస్తూ, శుక్రుడి కుమార్తె అయిన దేవయానికి సంతోషం కలిగిస్తూ కొంతకాలం గడిపాడు. కచుడు బృహస్పతి కొడుకని దానవులకు తెలియ వచ్చింది. అతను అరణ్యంలో గురువుగారి గోవులను కాసేటప్పుడు దానవులు అతన్ని చంపి, ముక్కలు చేసి, తోడేళ్ళకు వేశారు. ఈ సంగతి తెలియగానే శుక్రుడు తన మృతసంజీవనితో కచుణ్ణి మళ్ళీ బతికించాడు. ఇంకోసారి కచుడు దేవయాని కోసం పూలు తేవటానికి పోతే, దానవులు అతన్ని మళ్ళీ చంపి, సముద్రంలో కలిపేశారు. కచుడి కోసం దేవయాని ఏడవ సాగింది. శుక్రుడు అతన్ని మళ్ళీ బతికించాడు.



దానవులు మూడోసారి కచుణ్ణి చంపి నప్పు డతన్ని బూడిద చేసి, ఆ బూడిదను కల్లులో కలిపి, శుక్రుడికి తాగటానికి ఇచ్చారు. ఈసారి శుక్రుడు బతికించి నప్పుడు కచుడు శుక్రుడి పొట్టలో ఉన్నాడు. శుక్రుడు విధిలేక అతనికి మృతసంజీవనీ మంత్రం చెప్పి, తన పొట్ట చీల్చుకుని బయటికి రమ్మనీ, ఆ తరవాత ఆ మంత్రంతో తనను తిరిగి బతికించమనీ అన్నాడు. కచుడు అలాగే చేశాడు.

కచుడు వచ్చిన పని అయిపోయింది. అతను సమయం చూసుకుని, వెళ్ళి వస్తా నన్నాడు గురువుతో. అప్పుడు దేవయాని, "నీ మీది మోహంతో నిన్ను ఎన్నోసార్లు బతి కించుకున్నాను. నన్ను పెళ్లాడు," అన్నది.

"అమ్మమ్మా, నువు గురుపుత్రివి. నా చెల్లెలులాటి దానివి," అన్నాడు కచుడు.

"అలా అయితే నీకు మృతసంజీవని ఫలించకుండుగాక!" అని దేవయాని కచుడికి శాపం పెట్టింది.

"నిన్ను బ్రాహ్మణు డెవడూ పెళ్ళాడ కుండుగాక," అని ఎదురుశాపం పెట్టి కచుడు తిరిగి వెళ్ళిపోయాడు.

దానవులకు రాజైన వృషపర్వుడికి శర్మిష్ఠ అని కూతురున్నది. ఒకనా డామె దేవ యానినీ, అనేకమంది చెలికత్తెలనూ వెంట







బెట్టుకుని వనవిహారానికి బయలుదేరింది. ఒక చోట వాళ్ళ కొక సరస్సు కనబడింది. యువతు లందరూ తమ బట్టలు విప్పేసి, ఒడ్డున పెట్టి, సరస్సులో కొంతసేపు జలకా లాడారు. ఆ సమయంలో గాలికొట్టి వాళ్ళ చీరలు లుంగచుట్టుకు పోయాయి. జల క్రీడలు ముగించి యువతులు ఒడ్డుకు వచ్చి చీరలు కట్టుకోవటంలో, తొందరలో శర్మిష్ఠ దేవయాని చీరె కట్టేసుకున్నది. దేవయానికి శర్మిష్ఠ చీర మిగిలింది.

దేవయాని అహంకారంతో, "ఓసి రాకాసీ, నేను బ్రాహ్మణ స్త్రీని. నీ చీర నేను కట్టను. నాకు ఆచారం వున్నది. నా చీర నువ్వెందుకు కట్టుకున్నావు?" అని నిలదీసి అడిగింది.

"పోవే, బిచ్చగత్తె! నీ తండ్రి నా తండ్రి ఇచ్చినది స్వీకరించి, మమ్మల్ని ఆశ్రయించి బతుకుతున్నారు. నా చీర కట్టడానికి నీకు ఆక్షేపణ వచ్చిందా?" అని శర్మిష్ఠ అన్నది. అంతటితో ఊరుకోక శర్మిష్ఠ కోపావేశంలో దేవయానిని ఆ పక్కనే వున్న బావిలోకి తోసి, తన చెలికత్తెలతో వెళ్ళిపోయింది.

కొంచెం సేపటికి యయాతి అటుగా వచ్చాడు. ఆయన వేటాడుతూ, అలిసి పోయి, దప్పికతో బావి సమీపించి లోపలికి తొంగి చూశాడు. దేవయాని కనిపించింది. "ఎవరు నువు? బావిలోకెలా వచ్చావు?" అని యయాతి అడిగాడు.

"నేను దానవగురువైన శుక్రాచార్యుల కుమార్తెను. నా పేరు దేవయాని. కారణాంతరం చేత నేను బావిలో పడ్డాను. నన్ను బయటికి తియ్యి," అంటూ దేవయాని తన చేతిని పైకి చాచింది. యయాతి తన కుడి చేత్తో ఆమె కుడిచెయ్యి అందుకుని, ఆమెను పైకి లాగి, తన దారిన తాను వెళ్ళాడు.

ఈలోపల ఘూర్ణిక అనే దాసీది దేవయానిని వెతుక్కుంటూ అటు వచ్చింది. దేవయాని దానితో, "ఒసే, నే నిక వృష





పర్వుడి నగరులో అడుగుపెట్టను. శర్మిష్ఠ నాకు చేసిన అపచారం గురించి నా తండ్రికి చెప్పు, పో," అన్నది.

కబురందగానే శుక్రుడు దేవయాని వద్దకు పరిగెత్తుకుంటూ వచ్చి, "శర్మిష్ఠకు నువ్వేం అపకారం చేశావు, తల్లీ?" అని అడిగాడు.

దేవయాని తండ్రితో జరిగినదంతా చెప్పి, శర్మిష్ఠ ఆయనను అన్న మాటలు కూడా చెప్పింది. అంతా విని శుక్రుడు, "అమ్మా, నువు తప్ప నా కెవరున్నారు? నువు రాకపోతే వృషపర్వుడి నగరానికి నేనూ వెళ్ళను," అన్నాడు.

ఇంతలో సంగతంతా తెలుసుకుని వృష పర్వుడు స్వయంగా బయలుదేరి వచ్చి, "మీ రిద్దరూ ఈ వనంలో ఉన్నారేమిటి? నగరానికి పోదాం పదండి," అన్నాడు.

"మీ వరస నా కేమీ బాగాలేదు. మీ వాళ్ళు నా శిష్యుడైన కచుణ్ణి మాటిమాటికీ చంపారు. ఇప్పుడేమో నీ కూతురు నా కూతుర్ని నూతిలోకి తోసి, చంపాలని చూసింది. నాకు మీ సేవ వద్దు," అన్నాడు శుక్రుడు కోపంగా.

వృషపర్వుడు కాళ్ళావేళ్ళా పడ్డాడు. దేవయానిని ఒప్పించమనీ, ఆమె ఇష్టమే తన ఇష్టమనీ శుక్రుడు చెప్పాడు. శర్మిష్ఠా, ఆమె దాసీజనమూ తనకు దాసీలుగా ఉండే టట్టయితే తాను నగరుకు వస్తానన్నది దేవయాని. వృషపర్వుడు సరేనన్నాడు. శర్మిష్ఠ దేవయానికి దాసిగా వచ్చింది; దేవయాని అనే సూటిపోటి మాటలన్నీ సహించింది. ఎందుకంటే శుక్రాచార్యులు మూలంగా దానవలోకం ఎంతో మేలు పొందింది.

ఒకనాడు దేవయాని శర్మిష్ఠనూ, మిగి లిన దాసీలనూ వెంటబెట్టుకుని, పూర్వం వెళ్ళిన చోటికే వెళ్ళింది. మళ్ళీ యయాతి వేటాడుతూ అటుగా వచ్చాడు; శర్మిష్ఠనూ,



దేవయానిని చూసి, "మీ రెవరు?" అని అడిగాడు.

దేవయాని అతని పేరూ, కులమూ తెలుసుకుని "ఇంతకు పూర్వం నాకు చెయ్యి ఇచ్చి నూతిలో నుంచి నువే కాదా పైకి లాగావు? ఆ రోజు మనకు పాణి గ్రహణం జరిగింది. అది మొదలు నిన్నే నా భర్తగా భావిస్తున్నాను," అన్నది.



బ్రాహ్మణుడి కూతుర్ని తాను ఎలా పెళ్ళాడటమా అని యయాతి జంకాడు. కాని శుక్రుడు వారిద్దరి పెళ్ళినీ ఆమోదించాడు. ఇద్దరికీ వైభవంగా పెళ్ళి అయింది. శుక్రుడూ, దానవప్రముఖులూ యయాతికి ఘనంగా కట్నాలు ఇచ్చారు. దేవయాని శర్మిష్ఠనూ, మరి రెండువేలమంది దాసీలనూ వెంటబెట్టుకుని కాపరానికి వచ్చింది. శర్మిష్ఠా, దాసీలూ ఉండటానికి అశోకవనానికి సమీపంగా ఒక పెద్ద భవనాన్ని యయాతి ఏర్పాటు చేశాడు.

దేవయాని యయాతికి యదుడూ, తుర్వసుడూ అనే కొడుకులను కన్నది.

కొంత కాలం గడిచాక శర్మిష్ఠ తన స్థితి తలుచుకుని విచారించింది. ఇంత కాలమైనా తనకు పెళ్ళి లేదు. దేవయాని అప్పుడే పిల్లలతల్లి కూడా అయింది. "దేవయాని వరించినట్టుగానే నేను కూడా యయాతిని ఎందుకు వరించరాదు?" అని ఆమె అనుకున్నది.

ఒకనాడు యయాతి అశోకవనం కేసి రాగా, శర్మిష్ఠ ఆయనను కలుసుకుని, "రాజా, నా యజమానురాలికి భర్తవైన నువు నాకూ భర్తవే. నన్ను భార్యగా పరిగ్రహించు. ఇందులో అధర్మం లేదు," అన్నది.

శుక్రు డేమంటాడో నని యయాతి భయపడ్డాడు. అయినా ఆమె కోరికను నిరాకరించలేక, ఆమెతో రహస్యంగా కాపరం చేస్తూ, ఆమె ద్వారా ద్రుహ్యుడు, అనుడు, పూరుడు అనే కొడుకులను కన్నాడు.

శర్మిష్ఠ పిల్లలతల్లి అయిన మాట దేవయానికి తెలియవచ్చింది. ఆమె శర్మిష్ఠను చూడబోయి, "నీవు ఉత్తమశీలవనీ, నీతిపరురాలివనీ, గొప్ప వంశంలో పుట్టినదానవనీ అంటున్నారే, పెళ్ళి కాకుండానే నీకి పిల్లలు ఎలా కలిగారు?" అని అడిగింది.

శర్మిష్ఠ సిగ్గుతో తల వంచుకుని, "నేను ఋతుస్నానం చేసిన తరుణంలో ఒక మహాముని వచ్చి నాకు పుత్రదానం చేశాడు," అన్నది.

"ఎవరా ముని? ఏం పేరు? ఏం కులం?" అని దేవయాని మళ్ళీ అడిగింది.

"ఆ మహానుభావుడి దివ్య తేజస్సు చూస్తూ నాకు ఆ వివరాలు అడగ బుద్ధి కాలేదు," అన్నది శర్మిష్ఠ.

దేవయాని తృప్తిపడింది.

మరొకసారి యయాతీ, దేవయానీ కలిసి శర్మిష్ఠ ఉండే చోటికి విహారంగా వచ్చారు. అప్పుడు దేవయాని నిజం తెలుసుకున్నది. శర్మిష్ఠ బిడ్డలలో యయాతి పోలికలున్నాయి. "మీ తండ్రి ఎవరు? నిజం చెప్పండి," అని ఆమె ఆ పిల్లల నడిగితే వాళ్ళు యయాతిని చూపారు.

వెంటనే దేవయాని శర్మిష్ఠ పైన విరుచుకు పడుతూ, "ఓసి రాకాసీ, నాకే ద్రోహం తల పెట్టావా?" అన్నది.

శర్మిష్ఠ తొణకకుండా, "నేను అధర్మం చెయ్యలేదు. ఈ రాజును నువు వరించి నట్టే నేను వరించాను. నువు నా కన్నా పెద్దదానవు, బ్రాహ్మణ స్త్రీవి. అందుకని నిన్ను గౌరవిస్తాను. కాని ఈయన రాజర్షి. అందుకే, ఒక ఋషికి పిల్లలను కన్నానని నీతో చెప్పాను," అన్నది.

దేవయాని యయాతితో, "నాకు ద్రోహం చేశావు. నేను నీ వద్ద ఉండను," అని, తిన్నగా తన తండ్రి వద్దకు వెళ్ళి, జరిగినదంతా చెప్పింది. శుక్రుడు యయాతిని, ముసలివాడవు కమ్మని శపించాడు.





# గాంధీ కథ

దాంపత్యబంధం అత్యంత పవిత్రంగా ఉండాలని మోహన్ ఎక్కడో చదివాడు. భర్త భార్య విషయంలో ఎలాంటి కఠోర వ్రతం గలిగి ఉండాలో భార్య కూడా భర్త పట్ల అలాటి పాతివ్రత్యం ఆచరించాలి. అతను భార్యను ఎటూ కదలనిచ్చేవాడు కాడు. ఎక్కడికన్నా వెళ్ళాలంటే, గుడికి పోవాలన్నా, ఆమె తన అనుమతితోనే వెళ్ళాలి. కస్తూర్బాయి ఈ నిర్బంధాలను సహించలేక, ఎదురు తిరిగి సత్యాగ్రహం చేసింది.

తరవాత చాలా ఏళ్ళకు గాంధీజీ తన ఆ నాటి ప్రవర్తన గురించి చెబుతూ, "నేను నా భార్య మీద అధికారం చలాయించబోయి ఆమె నుంచి సత్యాగ్రహం నేర్చుకున్నాను. ఆమె నా మూర్ఖత్వాన్ని సహించటం చూసి నాకే సిగ్గయింది. చివరకామె నుంచి అహింసా విధానం నేర్చుకున్నాను," అన్నాడు.

తాను పెద్దల మాట జవదాట నని మోహన్‌కు చిన్నతనంలో చాలా గర్వం ఉండేది. పెద్దలు చెప్పేదంతా గుడ్డిగా ఆచరించటంలో తన స్వాతంత్ర్యం పోతున్నదనేది అతనికి క్రమంగా తెలిసివచ్చింది. అతను "తిరుగుబాటు" చేశాడు. వైష్ణవులైన గాంధీలు మాంసాహారమూ, పొగ తాగటమూ మహా పాపాలుగా పరిగణించే వారు. ఒక సహాధ్యాయి ప్రోత్సాహంతో మోహన్ రహస్యంగా మాంసం తినటం అభ్యసించాడు. కాని ఇంటి వద్ద భోజనం మాని, తల్లి కారణ మడిగితే అబద్ధం ఎలా చెప్పటం? అబద్ధం మోహన్‌కు అసాధ్యం. మాంసాహారం మానకతప్పలేదు.

అలాగే మోహన్‌కు మరొక సహాధ్యాయి సిగిరెట్లు కాల్చటం నేర్పాడు. కాని సిగిరెట్లకు డబ్బు కావాలి. దొంగతనం చేస్తేనే గాని డబ్బు రాదు. అందుచేత వారి నియమం



సాగలేదు. ఒక రోజున పొగతాగమని ఇద్దరూ ప్రమాణం తీసుకున్నారు.

ఒకసారి మోహన్ కొంచెం బంగారం దొంగిలించాడు. అదైనా తన కోసం కాదు, తన అన్న చేసిన బాకీ తీర్చటం కోసం. ఈ దొంగతనం మోహన్ అంతరాత్మను ఎంతగా కలత పెట్టిందంటే, చివరకు అతను తాను చేసిన పని ఒప్పుకుంటూ ఒక కాగితం మీద రాసి తీసుకుపోయి తన తండ్రికి ఇచ్చాడు. ఇద్దరి కళ్ళా ఒక్కసారే బాష్పాలు రాలాయి. తండ్రి కొడుకును క్షమించటమూ, కొడుకు చేసిన తప్పుకు పరిహారమూ అలా జరిగింది.



మోహన్ చిన్నతనంలో అందరూ చేసే తప్పులను మించి ఏమీ చెయ్యలేదు. కాని తాను నైతికంగా తప్పు చేశాననుకున్నప్పుడు దాన్ని గురించి తన అంతరాత్మను శోధించుకుని, "ఇంకెన్నడూ అలా చెయ్యను," అన్న తీర్మానానికి వచ్చేవాడు. తనను తాను అభివృద్ధి చేసుకోవాలన్న తహతహ అతనిలో అపారంగా ఉండేది. ప్రహ్లాదుడి కథా, హరిశ్చంద్రుడి కథా ఎరగని పిల్లలుండరు. కాని మామూలు పిల్లలు వాటిని కల్పనా కథల కిందనే జమకడతారు. కాని మోహన్‌కు మాత్రం ఆ కథలు వాస్తవమైన నీతి పాఠాలుగా తోచేవి.

అతను **1887** లో మెట్రిక్యులేషను పాసయాడు. అతని అన్నదమ్ములలో చదువు అంటినది మోహన్‌కు ఒకడికే. అందుచేత అతన్ని కాలేజిలో చేర్పించటానికి భావనగరు పంపారు. అతను ఇంగ్లండు వెళ్ళి బారిస్టరైతే బాగుంటుందనీ, బారిస్టరు కావటం తేలిక అనీ, ఆ చదువుతో అతను కూడా ఏ సంస్థానానికో, తండ్రి తాతల లాగే దివానుగా పనిచెయ్యవచ్చుననీ, అతని మేలుకోరినవారు చెప్పారు.

మోహన్‌కు ఈ ఆలోచన నచ్చింది. అతనికి భావనగరు కాలేజీ చదువు ప్రాణ





కంటకంగా ఉన్నది; ఏమంటే, ఆ కాలేజీలో ఇంగ్లీషులో చదువు చెబుతున్నారు, అది అతని బుర్ర కెక్కటం లేదు.

మోహన్‌ను ఇంగ్లండు పంపాలంటే డబ్బు కావాలి. అదృష్టవశాన అతని పెద్ద అన్న డబ్బు పుట్టించగలిగాడు. తన కడగొట్టు కొడుకు విదేశాలకు వెళ్ళి ఏ పాప పంకిలంలో ఇరుక్కుంటాడో నని తల్లి పుత్లీబాయి చాలా భయపడింది. అయితే తాను విదేశాలలో మద్యాన్నీ, మాంసాన్నీ, స్త్రీనీ తాకనని ప్రమాణం చేసి మోహన్ ఇంగ్లండుకు బయలుదేరాడు. అతను 1888 సెప్టెంబరు 4న బొంబాయిలో ఓడ ఎక్కాడు. అప్పటికి అతని తండ్రిపోయాడు.

అసలే పిరికివాడైన మోహన్ ఓడ మీద ఉన్నన్నాళ్ళూ బొత్తిగా ఒంటరిగాడయిపోయాడు. అందరూ కొత్తవాళ్ళు. అంతా కొత్త. మద్యమాంసాలు ముట్టనని ప్రమాణం చేశాడు. "ఇందులో ఏముంది?" అని వడ్డనవాళ్ళను అడగటానికి భయం. అందుచేత దారి-పొడుగునా తాను ఇంటి నుంచి తెచ్చుకున్న తినుబండారాలూ, మిఠాయీ మాత్రమే తిన్నాడు. "మాంసం తినకపోతే ప్రాణాలతో ఇంగ్లండు చేరవు," అని సాటి ప్రయాణీకులు అతన్ని హడలగొట్టారు.



అయినా అతను ప్రాణాలతో ఇంగ్లండు చేరాడు. చేరాక ఒంటరితనం మరింత దుర్భరమయింది. వచ్చిన కాస్త ఇంగ్లీషూ నోటికి రాలేదు. ఇంటి వద్ద ప్రియమైన తల్లినీ, భార్యనూ, ముద్దుల కొడుకునూ వదిలి వచ్చాడు. బుద్ధి వారున్న రాజకోట కేసి మళ్ళింది. తన చుట్టూ ఉన్న వాతావరణమూ, పరిస్థితులూ, భవిష్యత్తూ బొత్తిగా అయోమయంగా తోచాయి. శాకాహార వ్రతం అవలంబించి అతను డొక్క మాడ్చుకోవటంతో బాటు నలుగురూ చేసే గేలికి కూడా గురిఅయాడు. రాత్రిపూట పడుకుని తన దుస్థితికి ఏడ్చేవాడు.

ఇంగ్లడులో తాను మూడేళ్ళు ఎలా గడపాలో ఊహించుకోలేక పోయేవాడు.

ఒక రోజు అతను లండను వీధుల వెంట తిరుగుతూండగా ఫారింగ్డన్ వీధిలో శాకాహార భోజనశాల కనబడింది. బతుకు జీవుడా అనుకుని అతను అక్కడ మొట్టమొదటి సారిగా కడుపునిండా తిన్నాడు. ఇక్కడే శాకాహరాధిక్యత మీద ఒక పుస్తకం కొని అతను చదివాడు. అప్పటి దాకా మోహన్ మాంసాహారమందు రుచి ఉండి కూడా ప్రమాణానికి కట్టుబడిన శాకాహారి. కాని, ఈ పుస్తకం చదవడంతో అతను మనస్ఫూర్తిగా శాకాహారి అయాడు.

శాకాహరంతో అతను తన ఆరోగ్యాన్ని పాడుచేసుకుంటాడని అతని మిత్రులు భయపడ్డారు. తన శాకాహార వ్రతం "ఛాందసం" కాదని రుజువు చెయ్యటానికి మోహన్ ఇంగ్లీషు "జెంటిల్‌మన్" లాగా దుస్తులు వేసుకోసాగాడు. బంగారపుగొలుసూ, గడియారమూ పెట్టాడు. వక్తృత్వమూ, నృత్యమూ, సంగీతమూ ట్యూషన్ల ద్వారా నేర్చుకున్నాడు. వెండి పొన్ను కర్ర ఒకటి పట్టుకుని చాలా "ఫాషనబుల్" గా తయారయాడు. చదువు మీద లక్ష్యం లేని షోకేలా విద్యార్థులు మాత్రమే అలా తిరుగుతారు.

కాని అతని అంతరాత్మ ఊరుకోలేదు. ఎన్ని వేషాలు వేసినా తాను ఇంగ్లీషు "జెంటిల్‌మన్" కాలేడు. తన అన్న తన చదువుకు డబ్బు పంపటానికి ఎన్ని అగచాట్లు పడుతున్నాడో — ఎంతగా అప్పుల పాలవుతున్నాడో! మూడు నెలలు స్వేచ్ఛగా డబ్బు తగలేసి, మోహన్ తన ఖర్చు దమ్మిడీలతో సహా ఎకౌంటు రాయసాగాడు. చవుకగదికి మారి, తానే వంట చేసుకుంటూ, బస్సు లెక్కటం మానుకుని రోజుకు పది మైళ్ళు నడుస్తూ, తన ఖర్చు నెలకు రెండు పౌన్లు (సవర్లు) దాటకుండా చేసుకున్నాడు. డబ్బు కోసం ఇంటికి రాయటం తగ్గింది.



# 89. ఏథెన్స్ దుర్గం

ఏథెన్స్ నగరవాసులకు పనులు కల్పించి నిరుద్యోగం నిర్మూలించటానికిగాను పెరిక్లిస్ చందాలు వసూలు చేసి, క్రీస్తుపూర్వం 447 లో ఈ దుర్గమూ, ఇందులో ఒక దేవాలయమూ, సమావేశాలకు గాను ఒక ప్రదేశమూ నిర్మింపజేశాడు. పర్షియనులు దాడి చేసినప్పుడు దీనిని కొంత ధ్వంసం చేశారు.



Photo by Ranbir S. Bakhshi



బహుమతి పొందిన వ్యాఖ్య

మచ్చిక చేస్తే

పంపినవారు:
ఎస్. శశిప్రభ, తెనాలి.

Photo by Anant Desai



బహుమతి
పొందిన వ్యాఖ్య

మక్కువ చూపును

పంపినవారు:
ఎస్. శశిప్రభ, తెనాలి.

# ఫోటో వ్యాఖ్యల పోటీ :: బహుమానం రు. 20 లు

ఈ ఫోటోల వ్యాఖ్యలు 1969 జూన్ నెల సంచికలో ప్రకటించబడును





★ పై ఫోటోలకు సరి ఐన వ్యాఖ్యలు ఒక్క మాటలోగానీ, చిన్న వాక్యంలోగానీ కావాలి. (రెండు వ్యాఖ్యలకూ సంబంధం వుండాలి.)

★ ఏప్రిల్ నెల 20-వ తేదీలోగా వ్యాఖ్యలు మాకు చేరాలి. తరువాత చేరే వ్యాఖ్యలు ఎంత మాత్రమూ పరిశీలింపబడవు.

★ మాకు చేరిన వ్యాఖ్యలలో అత్యుత్తమంగా వున్న సెట్టుకు (రెండు వ్యాఖ్యలకు కలిపి) రు. 20/లు బహుమానం.

★ వ్యాఖ్యలు రెండూ పోస్టుకార్డు పైన వ్రాసి, ఈ అడ్రసుకు పంపాలిః—చందమామ ఫోటో వ్యాఖ్యల పోటీ, మద్రాసు-26.

---

## ఏప్రిల్ నెల పోటీ ఫలితాలు

మొదటి ఫోటోః మచ్చిక చేస్తే

రెండవ ఫోటోః మక్కువ చూపును

పంపినవారుః ఎస్. శశిప్రభ,

C/o ఎస్. శ్రీధర్, ఎడ్వొకేట్, తెనాలి.

బహుమతి మొత్తం రు. 20/—ఈ నెలాఖరులోగా పంపబడుతుంది.

Printed by B. V. REDDI at The Prasad Process Private Ltd., and Published by B. VISWANATHA REDDI for Sarada Binding Works, 2 & 3, Arcot Road, Madras-26. Controlling Editor: 'CHAKRAPANI'




ప్రొత్సా ఫిలిమ్సు

# శభాష్ సత్యం

నిర్మాత Md. నాజెం

దర్శకత్వం జి. విశ్వనాథం

రచన ఆత్రేయ

పూర్ణా రిలీజ్

GOTETI




చిన్న ఆమొక్క ఎంతో చిన్నదిగా వుండేది. అయితే రానురాను పెరిగి యింత పెద్దదైంది. సరైన శ్రద్ధచూపిస్తే పెరుగుదల ఎప్పటికీ త్వరితంగా జరుగుతుంది.

మీ చిన్న పొదుపు మొత్తాల ఎకౌంటుకూడా యిదేమాదిరిగా త్వరితంగా పెరుగుతుంది. మొదట్లో అది ఎంత చిన్నదైనప్పటికీ కూడా క్రమక్రమంగా అది పెరిగి పెద్దదై వెడుతుంది. ఎన్నో మీ అవసరాలని అది తీరుస్తుంది. మీ పిల్లల ఉన్నతవిద్యకోసమో, మీకూతురు వివాహం కోసమో, కుటుంబ సౌఖ్యంకోసం సోపానాలు వేసేందు కో మీ సేవింగ్స్ ఎకౌంట్‌లోని మొత్తం మీకు ఎంతో వుపయోగ పడుతుంది.

మీకు అతిదగ్గరలోవున్న పియన్‌బి బ్రాంచికి వెళ్ళియిప్పుడు పొదుపు చేయ్యటం ప్రారంభించండి. మాకు దేశమంతటా 500కు మించి బ్రాంచీలు వున్నాయి.

## పంజాబ్ నేషనల్ బ్యాంక్

1895 నుండీ జాతికి సేవచేస్తున్నది
బ్యాంకు ఛైర్మన్ : యస్. పి. త్రిఖా

# సవ్యమైన పెంపకానికి రక్తి
# బోర్న్‌విటా శక్తి !

ఎదిగే వయసులోని చదువుకొనే పిల్లలకు రోజువారీ భోజనంవలన చేకూరే శక్తి చాలదు. వారికి కలిగే శక్తి అంతా చదువుల్లో ఆటలల్లో హరింపు అయిపోతుంది. పిల్లల సవ్యమైన పెంపకానికి సరియైన పోషణకు అధిక శక్తి చాలా అవసరం. తగిన శక్తిని సమకూర్చేందుకు వారికి ప్రతిరోజూ బోర్న్‌విటా ఇవ్వాలి. బోర్న్‌విటాతో పిల్లలు ఆరోగ్యంగా ఉత్సాహంగా ఉండగలరు. రుచికరమై శక్తి పోషకమైన బోర్న్‌విటా కోకో, పాలు, మాల్ట్, పంచదారల సంతులిత మిశ్రమము, మరి దీనిని తయారు చేసేవారు — క్యాడ్‌బరీస్




Bensons/0391 TEL.

**శక్తి, ఉత్సాహం మరియు రుచికోసం-క్యాడ్‌బరీస్ బోర్న్‌విటా!**


ఆ బాలగోపాలాన్ని ఆనందపరవశులను
వేస్తున్న మనోహర చిత్రం
వాహినీ వారి సమర్పణ!
బంగారు పంజరం
నిర్మాత-దర్శకుడు: బి.యస్.రెడ్డి

